మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రై మాసపత్రిక

జనవరి - మార్చి 2014

CONFERENCE

राष्ट्रीय सम्मेलन

ember 2013, BODH GAYA, BIHAR

उमानाथ मंच

CLAIMING OUR RIGHT TO A VIOLENCE FREE SOCIETY

## హింసలేని సమాజాన్ని నిర్మిద్దాం !



నూతన సంవత్సర
మరియు
సంక్రాంతి
శుభాకాంక్షలతో...



## ఎం. వరలక్ష్మి
సిడిపిఓ, ఐసిడిఎస్

## బి. సత్యవతి
ఎపిఓ, ఐసిడిఎస్

## ఇతర సిబ్బంది

## ఐసిడిఎస్ బొబ్బిలి (ఆర్) ప్రాజెక్టు
విజయనగరం జిల్లా.

చైతన్య మానవి

# నాటి మాటలన్నీ నీటిమూటలేనా?

**సంపాదకీయం... -**

2014 సార్వత్రిక ఎన్నికలకు సమయం తరుముకొస్తోంది. 2009లో జరిగిన ఎన్నికల్లో కేంద్రంలో, రాష్ట్రంలో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ప్రత్యేకించి సమాజంలో సగభాగమైన మహిళలకు తమ వాగ్దానాలతో "అరచేతిలో స్వర్గం" చూపించింది. "ఏరు దాటిన తర్వాత తెప్ప తగలెయ్యడం" అన్న మాటను అక్షరాల నిజం చేశాయి.

అయిదేళ్ళ పాలనను ఒకసారి నెమరువేసుకుంటే..

అంతా అస్థవ్యస్థమే. అత్యధిక ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలేవీ పాలకులకు పట్టలేదు. కని వినీ ఎరుగని రీతిలో మిన్నంటిన నిత్యవసరాల ధరలు, పేలవమైన ప్రజాపంపిణీ వ్యవస్థ, సబ్సిడీల కోత, లక్షల కోట్ల అవినీతి కుంభకోణాలు, మహిళలకు కరువైన భద్రత, బహుముఖాలుగా పెరుగుతున్న హింస, ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టుగా వున్న మహిళా రిజర్వేషన్ బిల్లు, అందుకోలేని స్థితిలో కార్పోరేటీకరించబడ్డ విద్య, వైద్యం, అమలుకు నోచుకోని జెండర్ బడ్జెటింగ్, చెప్పుకుంటూపోతే ఒకటా, రెండా అన్నీ వైఫల్యాలే.

మహిళలపై లైంగికదాడుల పరంపర భయోత్పాతం కల్గిస్తోంది. జాతీయస్థాయిలో అత్యాచార, వేధింపుల కేసులు 4శాతం, హత్యకేసులు 1శాతం పెరిగాయి. తెహెల్కా పత్రిక మాజీ ఎడిటర్ తరుణ్ తేజ్‌పాల్ అత్యాచార కేసులో అడ్డంగా దొరికిపోయాడు. న్యాయ వ్యవస్థకు తలవంపులు తెచ్చేవిధంగా జస్టిస్ ఎ.కె గంగూలీ ప్రవర్తన వుంది. దైవాంశ సంభూతుడిగా వెలుగొందిన ఆశారామ్ బాపు నైజం తేటతెల్లమైంది. కలంతో, గళంతో, ప్రవచనాలతో లైంగిక వేధింపులను ఎదుర్కోవాలని ఎదుటివారికి నీతులు చెప్పేవారు సైతం లజ్జ, భయం లేకుండా ప్రవర్తించడం "కంచే చేను మేసిన చందంగా వుంది". చట్టాలు చేసి చేతులు దులుపుకోవడం కాకుండా హింసకు కారణమైన మూలాలను సంస్కరించడానికి ప్రభుత్వం ఎందుకు పూనుకోవడంలేదు?

మరో వైపు విపరీతంగా పెరిగిపోతున్న నిత్యావసరాల ధరలు మహిళలను తీవ్ర అలజడి, ఒత్తిడి, రక్తలేమి, అనారోగ్యానికి గురిచేస్తున్నాయి. ప్రజలందరికీ ఆహార భద్రత కల్పిస్తామని తీసుకొచ్చిన "ఆహార భద్రతా చట్టం" అభద్రతను కలగజేస్తోంది. చట్టంలో అనేక లోపాలతోపాటు ఇందులో పేర్కొన్న నగదు బదిలీ అంశం చాలా ప్రమాదకరమైనది. ప్రజలకు సబ్సిడీని కత్తిరించడంతోపాటు మార్కెట్ శక్తుల దయా దాక్షిణ్యాలకు వారిని వదిలేసింది. ధరల నియంత్రణకు చర్యలు తీసుకోకపోగా ప్రజాపంపిణీ వ్యవస్థను కుదించివేసింది. ధరల నియంత్రణకు అవసరమైన దీర్ఘకాలిక ప్రణాళికపై ప్రభుత్వ దృష్టి ఏదీ?

మహిళలు ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న మహిళా రిజర్వేషన్ బిల్లు 17 ఏళ్ళుగా పార్లమెంట్ గోడలకు వేళ్ళాడుతూనేవుంది. దేశవ్యాప్తంగా పెల్లుబికిన ఉద్యమాల వల్ల బిల్లు 2010లో రాజ్యసభ గోడలు దాటినా లోక్‌సభలో ఇంకా అడుగు పెట్టలేదు. సమాజంలో మహిళల పట్ల వున్న వివక్షత, మూసపోత భావజాలానికి ప్రతినిధులుగా ఉన్న వివిధ రాజకీయ పార్టీలు అనేక అవరోధాలు, అడ్డంకులు సృష్టిస్తున్నాయి.

దేశస్వాతంత్ర్యాన్ని, సార్వభౌమత్వాన్ని తాకట్టు పెట్టే అణు ఒప్పందంతోసహా అనేక కార్మిక, ప్రజావ్యతిక బిల్లులను అప్రజాస్వామికంగా నెగ్గించుకున్న ఘనత ప్రభుత్వానిది. మరి విధాన నిర్ణయాల్లో మహిళలకు భాగస్వామ్యం కల్పించే మహిళా బిల్లు పట్ల అలసత్వం ఎందుకు? సమాజంలో నెలకొన్న లింగ వివక్షతను అంతమొందించేందుకు మహిళా రిజర్వేషన్ బిల్లు వంటి సానుకూల చట్టాలు రావాలి. లేకుంటే భారత ప్రజాస్వామ్య వ్యవస్థకే ప్రమాదం.

కేంద్ర ప్రభుత్వం 2005-06 నుండి జెండర్ బడ్జెటింగ్ ప్రతిపాదిస్తున్నా ఆచరణలో అమలుకు నోచుకోవడం లేదు.

మరి ఏమిటీ మన కర్తవ్యం?

ఓట్ల కాలం వచ్చేసింది. కల్లబొల్లి కబుర్లు, గారడీలతో, రాజకీయ పార్టీలు, నేతలు మన దగ్గరకొస్తున్నారు. మహిళల భవిష్యత్తును పంచరంగుల్లో చూపిస్తున్నారు. మహిళా ఓటర్లుగా మన మద్దతు ఎవరికివ్వాలో ఆలోచించాలి. మన ఓటు ఆయుధాన్ని ఎక్కు పెట్టాలి. మహిళా, కార్మిక, ప్రజావ్యతిరేక విధానాలను అనుసరించే పార్టీలను మట్టి కరిపించాలి. విద్వేషం, హింస, విధ్వంసకర భావాలకు ప్రతిబింబమైన పార్టీలను తిరస్కరించాలి. ప్రగతిశీల, లౌకిక, మహిళల సమానత్వాన్ని కోరుకునే పార్టీలనే ఎంచుకోవాలి.

విలువలతో కూడిన, నీతివంతమైన రాజకీయాలు సైద్ధాంతిక నిబద్ధత ద్వారానే సాధ్యమవుతాయి. అందుకోసం స్త్రీ, పురుషులు ఉభయులూ కలిసికట్టుగా ఉద్యమించాల్సిన అవసరముంది. ●

**సూక్తి** ఇతరులలో మంచిని చూడకపోవడం మనలో మంచితనం లేకపోవడాన్ని సూచిస్తుంది. - ఎడిసన్

# చైతన్య మానవి




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ**



చిరునామా:
బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.
e-mail chaitanyamanavi@gmail.com





విరాళం రూ : 10/-

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్,
హైదరాబాద్ - 500 044.


## విషయ సూచిక

# పటిష్ట పోరాటాలకు ఐద్వా మహాసభ పిలుపు

## 21-25, నవంబర్ 2013.బుద్ధగయా (బీహార్)

- టి.జ్యోతి




నయా ఉదారవాద ఆర్థిక విధానాలు, పెరుగుతున్న చాంధసవాదం, మతోన్మాదం, హింస తదితర దుష్ప్రభావాలకు అత్యధికంగా ప్రభావితం కాబడుతున్న వారు మహిళలు. అందుకని వాటిని వ్యతిరేకిస్తూ, మహిళలందరిని సంఘటిత పరిచి, పోరాటాలు ఉధృతం చెయ్యాలని ఐద్వా 10వ జాతీయ మహాసభ పిలుపునిచ్చింది. కుల, మత, ప్రాంతీయ, లింగ తదితర ప్రాతిపదికపై సామాన్య ప్రజలను విడగొట్టి వారిలో విద్వేషాలను, అసమానతలను రెచ్చగొట్టి పాలక వర్గాలు సమాజాన్ని ముక్కలు చేస్తున్నారు. దీనివల్ల ముఖ్యంగా అట్టడుగు వర్గాల మహిళలు తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు. సమాజంలో ఏర్పడుతున్న అంతరాలను, సమస్యలను అధిగమించడానికి వారినందరిని కూడగట్టి పోరాటాలకు సన్నద్ధం చేయాలని మహాసభ పిలుపునిచ్చింది.

బీహార్‌లోని బుద్ధగయాలో నవంబర్ 21నుండి 25వరకు జరిగిన ఐద్వా ఆలిండియా మహాసభలు అత్యంత ఉత్సాహపూరితంగా, స్ఫూర్తిదాయకంగా జరగడంతోపాటు మహిళా ఉద్యమానికే మార్గదర్శకంగా నిలిచాయి. ఈ3సం॥ల కాలంలో అంతర్జాతీయంగా, జాతీయంగా, ఆర్థికంగా, సామాజికంగా వచ్చిన అనేక మార్పులను, సమస్యలను మరియు వాటిని అధిగమించడానికి చేపట్టాల్సిన చర్యలను మహాసభ కులంకషంగా చర్చించింది. 23 రాష్ట్రాలనుండి 1,11,68,139 సభ్యత్వానికి ప్రాతినిధ్యంవహిస్తూ 761 మంది ప్రతినిధులు మహాసభకు హాజరయ్యారు.

**ఆయా రాష్ట్రాల్లో ప్రజా సమస్యలపై పోరాడి ధీరోదాత్తులుగా మహిళా ఉద్యమానికే ప్రేరణగా నిలిచిన మహిళలు తమిళనాడు, గుజరాత్, యు.పి. హర్యానా, బెంగాల్, బీహార్, మహారాష్ట్రాల నుండి మాట్లాడి మహాసభకు దిశా నిర్దేశం చేశారు. వారి మొక్కవోని సాహసం, అకుంఠిత దీక్ష, మడమతిప్పని కార్యోన్ముఖతకు మహాసభ యావత్తు ముక్తకంఠంతో జేజేలు పలికింది. మేము సైతం అంటూ గొంతు కలిపింది.**

నవంబర్ 21న జరిగిన ప్రదర్శన, బహిరంగసభలో ఐద్వా అగ్రనాయకులు బృందాకరత్, సుభాషిణి అలీ, సుధా సుందర్‌రామన్, జగ్మతి సంగ్వాన్ తదితరులు పాల్గొని " మహిళలపై నానాటికీ పెరుగుతున్న దాడులు, గృహహింస, అసమానతలకు వ్యతిరేకంగా మహిళాలోకం ఉద్యమించాలని " పిలుపునిచ్చారు.

అధ్యక్షురాలు శ్యామిలీగుప్త ఐద్వా జెండాను ఆవిష్కరించి మహాసభలను ప్రారంభించారు. ఐద్వా వ్యవస్థాపకులలో ఒకరైన పాపాఉమానాథ్ పేరుతో నామకరణం చెయ్యబడ్డ వేదికపై మహాసభలు ప్రారంభమయ్యాయి.

ఉద్యమరీత్యా బీహార్‌లో ఐద్వా కమిటి చిన్నదైనప్పటికీ, వలంటీర్లు అత్యంత క్రమశిక్షణ, పట్టుదలతో కృషిచేసి దేశ నలుమూలల నుండి వచ్చిన ప్రతినిధులకు అన్ని రకాల సౌకర్యాలు కల్పించారు. మహాసభల విజయవంతానికి సకలసన్నాహాలు చేశారు.

మహాసభ ప్రారంభంలో సామ్రాజ్య వాదాన్ని ప్రతిఘటించి, మహిళల సమానత్వం కోసం అహర్నిశలూ కృషిచేసిన కెప్టెన్ లక్ష్మి సెహగల్‌కు, పాపాఉమానాథ్‌కు మహాసభ నివాళులు అర్పించడంతోపాటు వీణామజుందార్, నిరుపమరాయ్, సుదీప్తో గుప్తా. పాంధే, టాన్యాలతోపాటు ఈ 3సం॥ కాలంలో అసువులు బాసిన అమరులందరికి మహాసభ సంతాపం ప్రకటించింది.

ఆయా రాష్ట్రాల్లో ప్రజా సమస్యలపై పోరాడి ధీరోదాత్తులుగా మహిళా ఉద్యమానికే ప్రేరణగా నిలిచిన మహిళలు తమిళనాడు, గుజరాత్, యు.పి., హర్యానా, బెంగాల్, బీహార్, మహారాష్ట్రాల నుండి మాట్లాడి మహాసభకు దిశా నిర్దేశం చేశారు. వారి మొక్కవోని సాహసం, అకుంఠిత దీక్ష, మడమతిప్పని కార్యోన్ముఖతకు మహాసభ యావత్తు ముక్తకంఠంతో జేజేలు పలికింది. మేము సైతం అంటూ గొంతు కలిపింది.

అమెరికా నుండి సౌహార్ద్ర ప్రతినిధిగా హాజరయిన 'ఎలిజబెత్ ఆర్మ్‌స్ట్రాంగ్" మాట్లాడుతూ " భారతదేశంలో మహిళా ఉద్యమం, ఐద్వా ఆధ్వర్యంలో జరుగుతున్న పోరాటాలు, వాటిని చూసి తాను చాలా ప్రభావితమయ్యానని చెప్తూ, అమెరికాలోని మహిళలు, మహిళా ఉద్యమాలు ఈ అనుభవాలను తీసుకొని పనిచెయ్యాలి" అని పిలుపునిచ్చారు. ఈ సందర్భంగా ఎలిజబెత్ రాసిన పుస్తకాన్ని బృందాకరత్ ఆవిష్కరించారు.

వై.డబ్ల్యుసి.ఎ, సి.డబ్ల్యు.డి.ఎస్ లతోపాటు సి.ఐ.టి.యు. ఎస్.ఎఫ్.ఐ, డి.వై.ఎఫ్.ఐ, వ్యవసాయ కార్మికసంఘం, రైతు సంఘం తదితర సంఘాలనుండి సౌహార్ద్ర ప్రతినిధులు హాజరై "హింసలేని సమాజం కోసం ఐద్వా చేస్తున్న పోరాటంలో తాముకూడా జతకలుస్తామన్నారు."

బృందాకరత్ మాట్లాడుతూ "మహిళల హక్కులకోసం, న్యాయంకోసం, పెరుగుతున్న దాడులకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న మహిళలందరికి అభినందనలు తెలిపారు. మహిళలు అనేక ప్రతికూల పరిస్థితులు, ఆటంకాలను అధిగమించి గతంలో ఎన్నడూ లేనంత పట్టుదల, ధైర్యసాహసాలు ప్రదర్శించి మిలిటెంట్ పోరాటాలు చేశారు. ఢిల్లీ గ్యాంగ్‌రేప్ కేసులో నేరస్థులకు వ్యతిరేకంగా మహిళలు, యువకులు, విద్యార్థులు, వృద్ధులు అంతా కలిసి ఐక్యంగా ఉద్యమించిన తీరు అందరికీ ఆదర్శం.




మహిళలపట్ల అనభ్య పదజాలం ఉపయోగించడం, కించపర్చడం తదితర చర్యలకు పాల్పడే వారికి అడ్డుకట్ట వెయ్యడానికి ప్రవర్తనా నియమావళిని రూపొందించాలని డిమాండ్ చేశారు. బెంగాల్‌లో మహిళలు ప్రమాదకర పరిస్థితులు ఎదుర్కొంటున్నారని, ప్రజాస్వామ్య హక్కులు కాలరాయబడుతున్నాయని, దీనికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్య శక్తులన్నీ ఏకం కావాలని, ప్రజాస్వామిక వ్యవస్థను పునాదిగా చేసుకునిహింసకు తావులేని వాతావరణాన్ని సృష్టించాలని" పిలుపునిచ్చారు.

ప్రధాన కార్యదర్శి సుధ సుందరరామన్ నివేదికను రెండు భాగాలుగా మహాసభలో ప్రవేశపెట్టారు. మొదటి బాగంలో అంతర్జాతీయ జాతీయ పరిస్థితులు, రెండవ భాగంలో కార్యక్రమాలు, నిర్మాణ రిపోర్ట్‌ను సభ ముందుంచారు.

సుధా సుందర్‌రామన్ మాట్లాడుతూ " వర్ధమాన దేశాలపై పెరుగుతున్న సామ్రాజ్యవాద దోపిడి, పెరుగుతున్న సైనిక స్థావరాలు, తనకు అనుకూలంగా లేని దేశాలను నియంత్రించడం " గురించి చెప్పారు. అమెరికా చర్యల వల్ల నేడు ఇరాక్ మళ్ళీ రక్తపాతంతో కూడిన హింసలోకి నెట్టివేయబడింది. పాలస్తీనా భూభాగంపై ఇజ్రాయిల్ దురాక్రమణ, దానికి అమెరికా మద్దతు. ముఖ్యంగా మహిళలు, యువతులు సనాతన వాదానికి, అణచివేతకు గురవుతున్న పరిస్థితిని " వివరించారు.

"దేశవ్యాప్తంగా ఐద్వా నిర్వహించిన అసంఖ్యాక పోరాటాలు, కార్యక్రమాల్లో ఆహార భద్రత, మహిళలపై పెరుగుతున్న హింస, 33% మహిళా రిజర్వేషన్ బిల్లు, శ్రామిక మహిళల సమస్యలు, ఆర్థిక అసమానతలు, మహిళల దైనందిన సమస్యలు తదితరం వున్నాయి. ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ కోసం ఐద్వా విస్తృతమైన పోరాటాలు నిర్వహించింది.

కార్యదర్శి నివేదికపై 23 రాష్ట్రాల నుండి 69మంది సభ్యులు చర్చల్లో పాల్గొన్నారు. "ప్రజాతంత్ర, లౌకిక , రాజ్యాంగ హక్కుల కోసం ఐద్వా నిలబడిన తీరు ప్రశంసనీయం " అని సభ అభినందించింది. బెంగాల్‌లో తృణముల్ కాంగ్రెస్ అప్రజాస్వామిక దాడులను, హత్యలను ప్రతిఘటిస్తూ కార్యకర్తలు ఉద్యమాలను ముందుకు తీసుకువెళుతున్న తీరును మహాసభ

అభినందించింది. కేరళలో సూర్యనెల్లి కేసులో, అట్టపాడి ప్రాంతంలో గిరిజన సమస్యలపై మరియు కుటుంబశ్రీ పథకం ద్వారా మహిళలను సంఘటితం చేసేందుకు ఐద్వా చేస్తున్న కృషిని మహాసభ ప్రశంసించింది. త్రిపురలో ఉగ్రవాదుల, తీవ్రవాదుల దాడులను ఎదుర్కొని మహిళా ఉద్యమాన్ని విస్తరించడంలో కార్యకర్తలు నిర్వహించిన పాత్రకు మహాసభ జేజేలు పలికింది. ఆంధ్రప్రదేశ్‌లో స్వయం సహాయ సంఘాల రోజు వారి సమస్యలపై, ప్రజాపంపిణీ వ్యవస్థ పటిష్టం కోసం ఐద్వా చేసిన కృషిని, తమిళనాడులో దళిత మహిళల సమస్యలపై, ప్రసార మాధ్యమాలలో చూపిస్తున్న మహిళల తిరోగమనాన్ని వ్యతిరేకిస్తూ తీసుకున్న కార్యక్రమాలు, మహాసభ వేదికపై



పంచుకోవడంతో ఆ అనుభవాలు ఇతర రాష్ట్రాలకు తోడ్పడ్డాయి. బి.జె.పి పాలిత రాష్ట్రాలలో కాలరాయబడుతున్న ప్రజాస్వామ్య హక్కులు, మహిళల స్వేచ్ఛకు భంగం కలుగుతున్న తీరును మహాసభ దుయ్యబట్టింది. రాజ్యాంగ విరుద్ధమైన 'ఖాప్' పంచాయితీల తీర్పులను మహాసభ తీవ్రంగా ఖండించింది. 2014 సం॥ నుండి ఐద్వా సభ్యత్వ రుసుమును 2రూ॥లకు పెంచుతూ మరియు మహాసభల్లో ప్యాట్రన్‌ను ఎన్నుకునే విధానాన్ని రాష్ట్రాలకు కూడా (జాతీయ మరియు రాష్ట్రాల వరకు మాత్రమే) వర్తింపచేస్తూ ఐద్వా రాజ్యాంగానికి చేసిన సవరణలను మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. మహిళలపై పెరుగుతున్న హింస -హక్కుల సాధన, ఆహారభద్రత, చట్టసభల్లో మహిళా రిజర్వేషన్ బిల్లు, ఖాప్ పంచాయితీల తీర్పులకు వ్యతిరేకంగా సమగ్ర చట్టం, పని ప్రదేశాలలో మహిళలపై లైంగిక వేధింపుల నిరోధం, ఆధ్యాత్మికత ముసుగులో మహిళలను మభ్యపెడుతున్న తీరు తదితర అంశాలపై మహాసభ ఏకగ్రీవంగాతీర్మానాలను ఆమోదించింది.

నేటి మహిళా ఉద్యమం ముందున్న ప్రత్యేకమైన సవాళ్ళను దృష్టిలో పెట్టుకుని "జెండర్ బడ్జెటింగ్-భారతదేశ అనుభవాలు, కార్పోరేటీకరించబడుతున్న వైద్యం, మహిళలు - ఉపాధి, సమాజంలో మరియు ప్రసారమాధ్యమాలలో తిరోగమనానికి



నెట్టబడుతున్న మహిళలు, మహిళలు- పంచాయితీరాజ్, ముస్లిం మహిళలు - అభద్రత , విద్య - మహిళల ప్రాథమిక హక్కు అనే అంశాలపై కమీషన్లు వేసి మహాసభ కూలంకషంగా చర్చించింది. ప్రతినిధులనుండి వచ్చిన అనుభవాలను, సూచనలను వేదికపైనుండి మహాసభ పంచుకుంది.

దేశవ్యాప్తంగా ప్రజా సమస్యలపై విస్తృతంగా నిర్వహిస్తున్న పోరాటాలను నిర్మాణంలో ఇముడ్చుకుంటూ ముందుకు సాగాలనీ, అన్ని వర్గాల మహిళల్లోకి సభ్యత్వాన్ని పెంపొందించాలని, వివిధ తరగతుల మహిళా సమస్యలపై కేంద్రీకరించాలని, సరళీకృత ఆర్థిక విధానాల నేపధ్యంలో పెరుగుతున్న గృహకార్మికుల సమస్యలపై, అసంఘటిత రంగ మహిళా కార్మికుల సమస్యలపై ప్రత్యేక కేంద్రీకరణ చేసి నిర్మాణాన్ని బలోపేతం చేసుకోవాలని ఇచ్చిన మహాసభ పిలుపును సభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

మహాసభ చివరిరోజు జాతీయ అధ్యక్ష, కార్యదర్శులుగా, మాలినీ భట్టాచార్య, జగ్మతి సంగ్వాన్, కోశాధికారిగా శ్రీమతి మరియు 32మంది ఆఫీస్ బేరర్స్‌తో కలిపి 97మందితో నూతన కేంద్రకమిటీని మహాసభ ఎన్నుకుంది. ఐద్వా రాజ్యాంగం ప్రకారం కార్యదర్శిగా, కోశాధికారిగా మూడు దఫాలు బాధ్యతలు నిర్వర్తించిన సుధా , బనానిబిశ్వాస్‌లను మహాసభ ప్రధాన బాధ్యతలనుండి రిలీవ్‌చేసింది.

సీనియర్ నాయకుల ఉద్యమస్ఫూర్తి, త్యాగనిరతి, నిస్వార్ధ సేవాతత్పరతను కొనసాగిస్తామని, అణిచివేయబడిన మహిళల ప్రజాస్వామ్య, లౌకిక హక్కుల పరిరక్షణకు కంకణబద్దులమౌతామని శపథం చేస్తూ "హింసలేని సమాజం మన హక్కని ఎలుగెత్తి చాటుదాం." అంటూ నినదిస్తూ రాబోయే కాలంలో ఉధృత పోరాటాలకు పదునుపెట్టడానికి సన్నద్ధమవుతూ ప్రతినిధులు ఏకోన్ముఖంగా రాష్ట్రాలకు కదిలారు.

**(25వ తేదీ మహాసభ చివరి అంకం నూతన కార్యవర్గం ఎన్నిక ముగుస్తుండగా, గత మహాసభనుండి అధ్యక్షులుగా వుండి ఈ మహాసభలో ప్యాట్రన్‌గా ఎన్నుకోబడిన శ్యామిలీ గుప్త గుండెపోటుతో మరణించిందన్న వార్త సభను శోకసంద్రంలో ముంచింది. శ్యామిలీ గుప్త ఆశయాలకు పునరంకితమౌతామని నినదిస్తూ మహాసభ నివాళులు అర్పించింది.)**

○

# సాహసమే ఊపిరిగా...

-కె. అంజన




బుద్ధగయ! బుద్ధుడు జ్ఞానోదం పొందిన స్థలంగా పేరొందిన పుణ్యక్షేత్రం. ఇటీవలే పేలుళ్ళ వలన పతాక శీర్షికలకు ఎక్కిందీ ప్రాంతం. ఆస్తిక నాస్తిక బేధం లేకుండా గౌరవం పొందే బుద్ధుడుతో ముడిపడిన ప్రదేశం కనక ప్రతివారికి ఆసక్తి కొంచెం ఎక్కువే. అంతటి ప్రాధాన్యత కలిగిన ప్రదేశములో ఐద్వా అఖిల భారత మహాసభలు జరగడం విశేషమైతే అవి అందించిన ఉత్తేజం మరింత విశేషమైనది. దేశం నలుమూలల నుంచి వచ్చిన సమరశీల ప్రతినిధులు సంఘ నాయకులు భిన్న నేపధ్యంలో వచ్చిన కార్యకర్తలు, విద్యాధికుల నుంచి గ్రామీణ మహిళలు వరకు సభా ప్రాంగణంలో సమాలోచనలు చేయడం ఉత్సాహపూరిత సన్నివేశం. మహిళలను వేధించే సమస్యలు, వాటి పరిష్కారాలు, ఐక్య ఉద్యమ నిర్మాణ విధానాలు, వివక్షపై పోరాట మార్గాలు విస్తారంగా చర్చించబడ్డాయి. మొత్తం మీద ఒక చైతన్యస్ఫూర్తి అక్కడ తొణికిసలాడింది.

ఇవన్నీ ఒక ఎత్తయితే, అన్నిటికన్నా ఉత్తేజకరమైనది ఉద్విగ్నమైందీ బాధిత మహిళల పోరాట శీలత. అత్యంత భయానక పరిస్థితులను తట్టుకుని ధైర్యంగా ముందుకు సాగుతున్న ఎందరో వీరనారులు మహాసభలలో పాల్గొన్నారు. వారందరిలోకి ప్రాణ్‌ధాయి, సరిత(మారుపేరు), మన్వారా బీబీ, సుశీలాదేవి, ముస్రరత్, అరుణిమ సిన్హాల పోరాటగాథలు కదిలించివేశాయి. ఒక్కొక్కరిదీ ఒక్కో కథ.. ఒక్కో వ్యధ . అయినా సరే, వాటిని అధిగమించి నిలిచారు. దుర్మార్గాలను ఎదిరించేందుకు దీక్షపూని పోరాట కేతనాలైనారు. ఐద్వా అండదండలతో సాహసోపేతంగా సాగారు. మార్గ మధ్యలో ఎన్ని ఆటంకాలు, సవాళ్లు ఎదురైనా కుంగిపోని వారి స్థయిర్యం సలామనిపిస్తుంది. వెన్ను చూపని వారి చైతన్యం శభాషనిపిస్తుంది. ఐద్వా పదవ జాతీయ మహాసభల సందర్భంగా ఆ ఆరుగురు వీరవనితలు తమ పోరుగాథలను వినిపించి, కార్యకర్తల్లో నూతనోత్తేజం నింపారు.

బుద్ధగయాలోని మగధ విశ్వవిద్యాలయ ప్రాంగణం నవంబర్ చివరి వారంలో జరిగిన ఐద్వా మహాసభలకు కొలువైంది. పాపా ఉమానాథ్ జ్ఞాపకార్థం ఏర్పాటుచేసిన వేదికపైకి ఆ ఆరుగురు మహిళలు చేరుకునే సరికి ఉత్కంఠభరిత వాతావరణం నెలకొంది. వారు చెప్పిన పోరు పాఠాలను సభకు హాజరైన 761మంది ప్రతినిధులు ఆసక్తిగా ఆలకించారు.

## పందొమ్మిదేళ్ల పోరాటం

వాచాతి. తమిళనాడులోని చిన్ని గ్రామం. 'మళయాలీ' గిరిజనులదే అక్కడ పైచేయి. ధర్మపురి జిల్లాలోని శిధేరి పర్వత పాదాల చెంత వారి జీవితాలు ప్రశాంతంగా సాగిపోయేవి. 1992 జూన్ 20వ తేదిన ఊహించని ఉత్పాతంలా 155 మంది అటవీ సిబ్బంది, 108 మంది పోలీసులు, ఆరుగురు రెవెన్యూ అధికారులు ఆ గ్రామం మీద దాడి చేసారు. గంధపు చెక్కల స్మగ్లర్ వీరప్పన్ ఆచూకీ చెప్పమంటూ వేధించారు. ఇవి చాలవన్నట్టు అమాయక గిరిజన మహిళల జీవితాలను ఆగం చేశారు. వాచాతి గిరిజనులపై జరిగిన ఈ దురంతాన్ని బయటి ప్రపంచానికి తెలియజేసిన ఘనత ఐద్వా, సిపిఐ(ఎం), తమిళనాడు ట్రైబల్ అసోసియేషన్‌దే. తమపై సామూహిక అత్యాచారం చేసిన అధికారులపై గిరిజనులు అలుపెరుగని న్యాయపోరాటం చేశారు. దుర్ఘటన జరిగిన పందొమ్మిదేళ్లకు.. 2011 సెప్టెంబర్ 29న ధర్మపురి జిల్లా సెషన్స్ కోర్టు దోషులను పేర్కొంటూ తీర్పు వెలువరించింది. దళితులపై దారుణానికి పాల్పడినందుకు, గిరిజన మహిళలపై అత్యాచారం చేసినందుకు 269మంది అధికారులను నేరస్థులుగా పేర్కొంది. తీర్పు

వెలువడే నరికే వారిలో 54మంది మరణించగా.... మిగిలిన 215 మందిని జైలుకు పంపారు. వీరిలో నలుగురు ఐఎఫ్ఎస్ అధికారులకు (వీరిలో ఒకరు పోలీస్ కమిషనర్) ఏడాది నుంచి పదేళ్ల కఠిన కారాగార శిక్ష పడింది. సిపిఎం ఇతర ప్రజా సంఘాలు పరిహారం కోసం కూడా పోరాడి విజయం సాధించారు. తమపై ప్రభుత్వ అధికారులు వడిగట్టిన దారుణానికి వ్యతిరేకంగా ఐద్వా అండతో న్యాయ పోరాటం చేసిన వారిలో ప్రాణ్‌ధాయి ఒకరు.

ముదురు ఎరుపు రంగు చీర కట్టుకుని, తెల్లటి శాలువా కప్పుకుని, రబ్బరు చెప్పులు తొడుకున్న నల్లటి బక్కపల్చటి రూపం ఆమెది. సభికుల ముందు నిలబడి ఇన్నేళ్లుగా తాము అనుభవించిన బాధను-వేదనను, చేసిన పోరాటాన్ని (మధ్య మధ్య కన్నీటి పర్యంతమౌతూ... ఉద్వేగానికి లోనౌతూ...) తమిళంలో విన్పించింది...“ ఎర్ర చందనం స్మగ్లింగ్ చేస్తున్నారు కాబట్టి మమ్మల్ని అరెస్టు చేస్తున్నామన్నారు పోలీసులు. నిజానికి పోలీసులే స్మగ్లింగ్ చేసేవారికి అండగా, భాగస్వాములుగా వున్నారు. అమాయకులమైన 105మందిని అరెస్టు చేశారు. 18మంది మహిళలపై దారుణంగా అత్యాచారం చేశారు. మా ఇళ్ల మీదపడి ఆహార పదార్థాలను నాశనం చేశారు. పశువులను చంపేశారు. మా కోళ్లు వండుకు తిన్నారు. వాళ్ల పళ్ళేల్లో మిగిలిన వాటిని తినమని మమ్మల్ని బలవంతం చేశారు. ఇక మా కోసం నిలబడేవారు... మమ్మల్ని కాపాడే వారూ లేరనే అనుకున్నాం. అందుకు ఎర్ర జెండా ఉందని,.. ఐద్వా ఉందని .. నిజానికి మేం బయటికి వచ్చాక తెలిసింది. ఆడవాళ్ళపై అత్యాచారం జరిగినప్పుడు..మహిళలు రెచ్చగొట్టే బట్టలు వేసుకుంటే ఇలా జరుగుతోందని అంటుంటారు. వేం గిరిజనులం. సంప్రదాయ బట్టలు వేసుకున్నాం. మేమెలాంటి రెచ్చగొట్టే బట్టలు వేసుకున్నాం గనక మా మీద అత్యాచారం చేశారు.? అందుకే ఇలాంటి మాటలను విని వూరుకోకూడదు. అడ్డుకోవాలి. పోరాడాలి.” అన్న ప్రాణ్‌ధాయి మాటలు ఐద్వాజెండా నీడలో బాధిత మహిళలు నడిపిన పోరాటాన్ని సభికుల కళ్ల ముందు నిల్పాయి.

**అగ్రకుల దురహంకారానికి పరాకాష్ట** దబ్రా! హర్యానా (హిస్సార్ జిల్లా)లోని ఒక గ్రామం. 2012 సెప్టెంబర్ 19న తేదీన పన్నెండు మంది అగ్రకుల అబ్బాయిలు దళిత బాలిక సరితపై సామూహిక అత్యాచారానికి తెగబడడమే కాక ఆ దారుణాన్ని దుర్మార్గంగా సెల్‌తో వీడియో తీశారు. విషయం బయటికి పొక్కితే.. .వీడియోను అందరికీ పంపిస్తామని బెదిరించారు. భయపడిపోయిన సరిత కొద్దిరోజులపాటు కన్నవారికి సైతం జరిగిన దారుణాన్ని చెప్పలేదు. తర్వాత తెలిసినా దళిత కుటుంబానికి చెందిన తమకు న్యాయం జరుగుతుందని గానీ, నేరస్థులకు శిక్ష పడుతుందన్న విశ్వాసం గానీ లేక సరిత కుటుంబీకులు ముందుకు అడుగువేయలేక పోయారు. మౌనాన్ని ఆసరాగా చేసుకున్న నేరస్థులు మరింత బరితెగించి వీడియోను ఇంటర్నెట్‌లో వుంచారు. అవమానాన్ని భరించలేని సరిత తండ్రి ఆత్మహత్య చేసుకున్నాడు. ఒంటరులైన బాధిత తల్లీ కూతుళ్లు ఐద్వా అండతో పోరాటం నడిపారు. 2013 మే 4న హిస్సార్ సెషన్స్ కోర్టు నిందితుల్లో నల్గురిని దోషులుగా పేర్కొనగా, మిగతా వారు బెయిల్‌మీద బయటపడ్డారు. ఇది బాధిత కుటుంబాన్నే కాక ఐద్వాను కూడా నిరాశ పర్చింది. కేసును జిల్లా కోర్టు నుంచి హైకోర్టుకు బదలాయించాల్సిందిగా ప్రభుత్వ న్యాయవాదిని కోరినా స్పందన కరువైంది. 90రోజుల అనంతరం ఐద్వా చొరవ చేసి జాతీయ మహిళా కమిషన్, రాష్ట్ర మహిళా కమిషన్‌తో కలిసి నిరసన తెలిపింది. నవంబర్‌లో బాధితురాలు, ఆమె కుటుంబంతో కలిసి ఐద్వా ప్రభుత్వ న్యాయవాదిని కలిసింది. ఆ తర్వాతే కేసును హైకోర్టుకు పంపడం జరిగింది.

తెల్లటి పంజాబీ డ్రెస్ వేసుకుని వేదికపై నిలబడిన సరితలో ‘బాధితనే! అయితేనేం!! నేరస్థులకు శిక్షపడేంత వరకు విడిచిపెట్టకుండా పోరాడుతున్నాను’ అన్న భావన తొణికిసలాడింది. “నేను ఒంటరిగాలేను. నావెంట ఇంత మంది వున్నారన్న (సభికులవైపు చూయిస్తూ) నమ్మకమే నన్ను నడిపించింది. లాయర్‌నై... నాలాంటి వారికోసం.... న్యాయం కోసం పోరాడుతాను...” సరిత నోటి నుంచి వచ్చిన మాటలు సభలో కూర్చున్న మహిళలను ఉత్తేజపరిచాయి.

**అరాచక పాలనపై గెలుపు**

మన్వారా బీబీ! పశ్చిమ బెంగాల్‌లోని బర్ద్వాన్ జిల్లా మధుదంగా గ్రామస్తురాలు. ఇటీవల జరిగిన పంచాయితీ ఎన్నికల్లో పోటీచేసింది. అక్రమ మార్గంలో, హింసాత్మక పద్ధతుల్లో పంచాయితీని అక్రమించు కోవాలనుకున్న తృణముల్ కాంగ్రెస్ గుండాలు మన్వారాను పోటీనుంచి విరమించుకోవాల్సిందిగా హెచ్చరించారు. బెదిరించారు. ఆమె భర్త హస్మీత్ సాగా స్థానికంగా పేరుగాంచిన కార్మిక నాయకుడు. భార్య పోటీ చేస్తున్న వార్డులో ఓటువేసేందుకు వరుసలో నిలబడిన అతడిని బాంబులు వేసి పొట్టన పెట్టుకున్నారు టిఎంసీ గుండాలు. జీవిత భాగస్వామిని కోల్పోయి పుట్టెడు బాధను దిగమింగి... టిఎంసీ గుండాగిరిపై పోరు సాగించింది మన్వారా బీబీ. గ్రామస్థుల అండతో ఎన్నికల్లో అత్యధిక మెజార్టీతో విజయం సాధించింది. రాష్ట్రంలో ప్రజాస్వామ్యాన్ని కాపాడు కోవడానికి గాను మహిళలు చేస్తున్న త్యాగాలకు ఇదో ఉదాహరణ. భర్తను హత్య చేసిన వారిని శిక్షించేందుకోసం నేటికీ పోరాడుతోంది మన్వారా. తృణమూల్ ప్రభుత్వ అండ కలిగిన నేరస్థులపై పోరు సాగించడం అంత సులువు కాదని తెలిసినప్పటికీ అదరకబెదరక మన్వారా ముందుకడుగేస్తోంది. తన కుటుంబ

బాధ్యతలు నిర్వర్తిస్తూనే పంచాయతీ సభ్యురాలిగా ఎన్నుకుని ప్రజలు తనపై వుంచిన నమ్మకాన్ని నిలబెట్టుకునేందుకు ప్రయత్నిస్తోంది.

ఎర్ర చీర కట్టుకుని, ఎర్ర శాలువా కప్పుకున్న మన్వారా... వేదికపై బెంగాలీ బాషలో చెప్పిన మాటలు... సభికులకు మరో మూడేళ్లపాటు కావాల్సిన ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని అందించాయి. "ప్రజాస్వామ్యం కోసం...మహిళల విముక్తి కోసం పోరాడుతునే వుంటాము" అన్న మన్వారా మాటలకు సభలోని మహిళలు చాలాసేపు హర్షధ్వానాలు చేస్తూండిపోయారు. పశ్చిమబెంగాల్‌లో తృణముల్ అరాచక పాలనకు వ్యతిరేకంగా పోరాడుతున్న వామపక్ష వాదులకు ఈ రూపంలో సంఘీభావం తెలిపినట్టుగా తోచింది.




## అలుపెరుగని పోరు

దర్భాంగా! బీహార్‌లోని ఓ గ్రామం. భూబకాసురులు ఆ చిన్ని గ్రామాన్ని వదలలేదు. గ్రామం ఉమ్మడి సొత్తుగా వున్న 8 ఎకరాల భూమిపై భూకామందుతో పాటు ఓ మాజీ ఐఎఎస్ అధికారి కన్ను పడింది. ఉమ్మడి భూమిని వీరి కబంధహస్తాల నుంచి విడిపించటానికి స్థానిక మహిళలు సుశీలా దేవి నాయకత్వంలో 1992నుంచి పోరాడుతునే వున్నారు. అదే ఏడాది వీరిని ఆ భూమిని నుంచి తరిమేయడానికి పోలీసులు ప్రయత్నించారు. అన్నీ సహించారే కాని భూమిపై తమ హక్కును కోల్పోవటానికి నిరాకరించారు. ఈ క్రమంలో సుశీల దేవి అనేక సార్లు గాయపడింది. భూమికోసం ఇప్పటికీ కోర్టులో ఎనిమిది కేసులతో పోరాడుతున్నారు. కోల్పోవటానికి నిరాకరించారు. ఈ క్రమంలో సుశీలా దేవి అనేక సార్లు గాయపడింది. భూమికోసం ఇప్పటికీ కోర్టులో ఎనిమిది కేసులతో పోరాడుతున్నారు.

లేత ఆకుపచ్చ చీర కట్టుకుని... ఎర్ర శాలువ కప్పుకున్న సుశీలా దేవినీ వేదికపై చూడగానే పోరాటంలో ధక్కామొక్కీలు తిన్న మహిళగా కన్పించింది. "భూమిని విడిపించడం కోసం పోలీసుల చేతిలో లాఠీదెబ్బలు తిన్నాం. మహిళలమంతా కలిసి ఎన్నో రాత్రులు స్థలానికి కాపలా వున్నాం. భూస్వాములతో కుమ్మక్కైన పోలీసులు.... మేం కట్టుకున్న 135 ఇండ్లను కూల్చేందుకు ప్రయత్నించినప్పుడు.... వారిచేతిలో దెబ్బలు తిన్నామే కాని మడమతిప్పలేదు. వెన్నీళ్లలో కారప్పొడి కలిపి పోలీసులతో పోరాడాం. ఇప్పటికీ కేసులు ఎదుర్కొంటున్నాం. భూమిని తిరిగి పొందేదాకా.... పోరు ఆపేదేలేదు...." అన్న సుశీల దేవి మాటలు కార్యకర్తల్లో నూతనోత్తేజాన్ని నింపాయి.

## ఎన్‌కౌంటర్ కాదది!

ఇష్రాత్ జహాన్! మహారాష్ట్ర థానే జిల్లాకు చెందిన పందొమ్మిదేళ్ల విద్యార్థిని. ఆమెను 2004లో గుజరాత్ పోలీసులు దారుణంగా చంపేశారు. ఇష్రాత్‌తో పాటుగా మరో ముగ్గుర్ని కూడా పోలీసులు పొట్టన పెట్టుకున్నారు. గుజరాత్ సిఎం మోడిపై దాడి చేయడానికి వచ్చిన వారిని ఎన్‌కౌంటర్ చేసినట్లు పోలీసులు కథలు అల్లేశారు. పైగా తనపై 'టెర్రరిస్టు' ముద్ర కూడా వేశారు. జూన్ పద్నాలుగున ఇష్రాత్ చనిపోయినదన్న వార్త ఆమె తల్లి షమీమా కౌసర్‌కు, తోబుట్టువులకు పత్రిక ద్వారానే తెలిసింది. తండ్రి లేని కుటుంబం కావడంతో పిల్లలకు ట్యూషన్లు చెప్పుకుంటూ, ఎంబ్రాయిడరీ చేసుకుంటూ కుటుంబానికీ చేదోడు వాదోడుగా వుండేది ఇష్రాత్. 2004 వేసవి సెలవుల్లో జావేద్‌తో కలిసి రెండు నెలల పార్ట్ టైమ్ ఉద్యోగం సంపాదించింది. జావెద్ పొరుగువాడే, తమ కుటుంబానికి పరిచయమున్నవాడే కావడంతో ఉద్యోగానికి ఆమె పెద్దలు కూడా అభ్యంతరం పెట్టలేదు. పని మీద వెళ్తున్న వారిని పోలీసులు బంధించి చంపేశారు. దీనితో ఇష్రాత్ కుటుంబీకులు అనేక ఆర్థిక, సామాజిక సవాళ్లను ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆదాయం లేక బాధిత తోబుట్టువులు చదువులు మానుకోవాల్సి వచ్చింది. 'టెర్రరిస్టు కుటుంబం' అన్న అపనింద కూడా అందుకు తోడైంది. అహ్మదాబాద్, న్యూ ఢిల్లీలోని ప్రగతిశీల కార్యకర్తలు, న్యాయ వాదుల సాయంతో ఇష్రాత్ తల్లి షమీమా పోరాటం సాగించారు. తన కుమార్తె పై పడిన 'టెర్రరిస్టు' అన్న నింద తొలిగినపుడు, నేరస్థులకు శిక్ష పడినప్పుడే తనకు న్యాయం జరిగినట్టుగా భావించారు. ఈ దుర్ఘటనపై సిబిఐ దర్యాప్తు జరపాల్సిందిగా 2004లో

షమీమా గుజరాత్ హైకోర్టును ఆశ్రయించారు. దర్యాప్తు చేసిన మేజిస్ట్రేట్ ఎస్.పి. తమంగ్ ఐదేళ్ల అనంతరం అది నకిలీ ఎన్‌కౌంటరని చెప్పడమేకాక ఎన్‌కౌంటర్ చేసిన పోలీసుల, అధికారుల పేర్లను వెల్లడించారు. 2013 జులైలో సిబిఐ నిందితులపై చార్జీషీటు దాఖలు చేసింది. ప్రస్తుతం వారిలో ఆరుగురు ఐసిఎస్ అధికారులు జైలు ఊచలు లెక్కబెడుతుండగా ఒకరు పరారీలో ఉన్నారు.

వేదిక పైకి తల్లి షమీమాతోపాటు వచ్చిన ముసర్రత్

(ఇష్రాత్ సోదరీ) మాటల్లోని వేగం, ఆవేశం, ప్రశ్నించిన వైనం 'నకిలీ ఎన్‌కౌంటర్' వారిని ఎంతటి వేదనకు గురిచేసిందో చెప్పకనే చెప్పాయి. " నాన్న మా చిన్నతనంలోనే చనిపోవడంతో ఏడుగురు పిల్లలం ఎలాంటి ఆధారం లేని వాళ్ళమయ్యాం. మేం పనిచేయక తప్పని పరిస్థితి, అక్క సెలవుల్లో ట్యూషన్ చెప్పేది. నాన్న స్నేహితుడైన జావేద్ ద్వారా తనకు పార్ట్ టైం పని దొరికింది. అయినా ఆడపిల్లలు పనికోసం పోవడమే నేరమా? పని చేయడాన్ని కూడా తప్పుగా చూడాలా? ఎన్‌కౌంటర్ అంటే అర్థం ఏంటో, నరేంద్ర మోడి ఎవరో కూడా మీడియ ద్వారానే తెలుసుకున్నాం. బల్లులు, బొద్దింకలంటేనే భయపడిపోయే అమ్మాయి ఒకరి ప్రాణం తీయడానికి వెళ్తుందా? మా అక్క ఇష్రాత్ టెర్రరిస్టు కాదని సిబిఐ నివేదికతో తేలింది. దాంతో మా పోరాటం 90శాతం వరకు విజయవంతమైంది. ఈ కేసులో పాల్గొన్న వారిలో అత్యధికులు జైల్లో వున్నారు. కుట్రకు పాల్పడిన వారికి శిక్ష పడే సమయం ఎంతో దూరం లేదు. అది కూడ జరిగితే పూర్తి విజయం సాధించినట్లు, మరో ఇష్రాత్ బలి కాకుడదన్న ఒకే ఒక కారణంగానే మిగిలిపోయిన పది శాతం విజయం కోసం మేం పోరాడుతున్నాం". అన్న ముసర్రత్ మాటలు అన్యాయంపై పిడికిళ్లు బిగించేలా సాగాయి.

## దృఢ సంకల్పానికి మారు పేరు

అరుణిమ సిన్హా! ఉత్తర ప్రదేశ్ వాలీబాల్ జాతీయ క్రీడాకారిణి. 2011లో లక్నో నుంచి ఢిల్లీ వెళుతుండగా...తన మెడలోని బంగారు గొలుసు లాక్కోబోయిన దుండగులతో జరిగిన పెనుగులాటలో ఒక కాలు కోల్పోయింది. ఆ సమయంలో అయినవారి దెప్పి పొడుపులు, ప్రభుత్వం చేసిన దుర్మార్గపు వ్యాఖ్యలు ఆమెను కుంగదీయకపోగా ఏదో సాధించాలన్న కసిని పెంచాయి. తొలిసారి ఎవరెస్టను అధిరోహించిన భారతీయ మహిళ బచేంద్రీపాల్ మార్గదర్శకత్వంలో అనుకున్నది సాధించి ఎందరికో స్ఫూర్తి ప్రధాతగా నిలవడమేకాదు! అననుకూల వాతావరణంలో 52 రోజులపాటు ప్రయాణించి ఎవరెస్టు శిఖరం మీద మువ్వన్నెల పతాకాన్ని నిలిపిన తొలి వికలాంగ మహిళగా ప్రపంచ రికార్డు సృష్టించింది.

ప్యాంటు-షర్టు వేసుకుని, వెంట్రుకలు లూజుగా వదిలేసిన అరుణిమ మైకు దగ్గరకు రాగానే చప్పట్లు మారుమోగాయి. "కొంతమంది దుండగులు నా చెయిన్ లాక్కోవాలని చూశారు. ఓ మధ్య తరగతి అమ్మాయిగా నాది అనుకున్న దాని కోసం పోరాడే తత్వం నాది. వారితో పెనుగులాడానే తప్ప గొలుసును తీసుకోనివ్వలేదు. వారు నన్ను రైల్లోంచి తోసేశారు. కాలు తెగిపోయి తీవ్ర రక్తస్రావంలో.. ఆ రాత్రంతా రైలు పట్టాలమీదే పడున్నాను. తెల్లారాక గ్రామస్థులు నన్ను ఆసుపత్రిలో చేర్చారు. నాది ఆత్మహత్య కేసుగా పోలీసులు సర్టిఫై చేశారు. పైగా నన్ను జాతీయ స్థాయి క్రీడాకారిణిగా గుర్తించడానికి తిరస్కరించారు. కాలు కోల్పోవడం కంటే ఇది ఎక్కువ బాధించింది. ఇంక ఆసుపత్రి బెడ్డు మీద వున్న నన్ను చూసి ఎలా బతుకుతావోనని, భవిష్యత్ ఎలాగోనని ఒకటే జాలి కురిపించారు బంధువులు. నాపట్ల జాలి చూపించడాన్ని జీర్ణించుకోలేకపోయాను. నన్ను నేను వికలాంగగా, అ స ఎ ే య ఐ ం ా లి గ ా అంగీకరించలేకపోయాను. అన్ని అవయవాలు బాగున్న వారితో పోటీ పడి ఏదైనా చేయాలనుకున్నాను. నా విజయాన్ని చూసిన జనం నా పట్ల జాలి చూపడం మానేస్తారని భావించాను. హాస్పటల్ బెడ్డు మీదే నిర్ణయించుకున్నాను. జీవితంలో కఠినమైన గేమ్ ఆడాలని, అందుకు మా కోచ్, అన్నయ్య అండగా నిలిచారు. రెండేళ్ళలో ప్రపంచంలోకెల్లా అత్యంత ఎత్తయిన ఎవరెస్టు శిఖరం(8,848 మీటర్లు) ఎక్కి నేనేంటో నిరూపించుకున్నాను. ఓ వైపు ఆక్సిజన్ సిలిండర్ ఖాళీ అయ్యింది. మరోవైపు కృత్రిమ కాలు ఇబ్బందిపెడుతుంది. వాతావరణం పూర్తి అననుకూలంగా వుంది. అయినా సరే వెనక్కి తగ్గలేదు. ఎవరెస్టు శిఖరంపై కాలు మోపాను. భగవంతుడు నాకొక్కదానికే దృఢ సంకల్పాన్ని ఇవ్వలేదు. అందరికీ ఇచ్చాడు. ఎవరైతే దాన్ని ఉపయోగిస్తారో వారు అక్కడ ఉంటారు. ఉపయోగించనివాళ్లు ఇక్కడే ఉండిపోతారు. నాలాంటి ఆడపిల్లల కోసం, మహిళల కోసం ఏదైనా చెయ్యాలనుకున్నాను. ఇతరుల కోసం బతకడంలో దొరికే మజానేవేరు" ఆవేశం, ఆరాటం నిండిన అరుణిమ మాటలకు సభ చప్పట్లతో మారు మోగిపోయింది.

పుస్తకాలలో చదివే.. మీడియాలో చూసే.. దుర్మార్గాలను మించినవి వ్యక్తిగతంగా ఎదురైనా కుంగిపోని ఈ ఆరుగురి స్థైర్యానికి సలాం చెయ్యనివారు, వెన్ను చూపని వారి చైతన్యానికి "శభాష్" అనని వారు మహాసభ ప్రాంగణంలో లేరేమో! ఉద్వేగభరితంగా సాగిన సెషన్ ఆఖర్న ఈ యోధురాళ్లకు బృందాకరత్ శాలువలు కప్పి, పూల గుత్తులు అందించి అభినందనలు తెలిపారు.



# ఆహార భద్రతపై తీర్మానం

## ఐద్వా 10వ జాతీయ మహాసభలు, బుద్ధగయా(బీహార్) నవంబర్ 21-25, 2013

ఐద్వా 10వ జాతీయ మహాసభ దేశంలోని తీవ్ర సమస్యలైన పౌష్టికాహారం మరియు ఆకలిని రూపుమాపటంలో ఇటీవలే పార్లమెంటులో పాసయిన జాతీయ ఆహార భద్రతా చట్టం యొక్క సామర్థ్యంపై తీవ్ర ఆందోళనని వ్యక్తంచేసింది. యు.పి.ఎ. ప్రభుత్వం ఈ చట్టం గురించి గొప్పగా చెప్పుకుంటుంది. కానీ, వాస్తవం అందుకు విరుద్ధంగా ఉంది. ఎందుకంటే ప్రజా పంపిణీ వ్యవస్థలోని అన్యాయాలను చట్టబద్దం చేయటం ద్వారా ఇది పరిస్థితిని మరింత దిగజారుస్తుంది.

ఆహార భద్రత అవసరమున్న ప్రజలని, ప్రాధాన్యతగల మరియు సామాన్య వర్గాలుగా అహేతుకమైన పద్ధతుల ద్వారా విభజించి, ప్రాధాన్యతా వర్గం మీద నిర్హేతుకమైన ముసుగు వేయటం ద్వారా కోట్లాదిమంది పేద ప్రజలను ఈ బిల్లు కింద లబ్ధిపొందనీయకుండా దూరం పెడుతోంది ప్రభుత్వం. అందుకే ఈ చట్టాన్ని గట్టిగా మేము వ్యతిరేకిస్తున్నాము.

ప్రభుత్వం చెప్పుకుంటున్న దేమిటంటే ఈ చట్టం ద్వారా 75శాతం మంది గ్రామీణ ప్రజలకి 50శాతం పట్టణ ప్రజలకి సగటున 67 శాతం ప్రజలకి లబ్ధి చేకూరుతుందని, ఇది కచ్చితంగా అవాస్తవం. ప్రణాళికా సంఘం ఏర్పరచిన సూత్రాల ప్రకారం, అన్ని రాష్ట్రాల సగటును విభజిస్తే వచ్చిన జాతీయ సగటు ఇది. ఈచట్టం ఫలితంగా రాష్ట్రాలు వాటికి ఇంతకుముందు ఉన్న ప్రజా పంపిణీ వ్యవస్థ కేటాయింపుని కోల్పోతాయి. ఒకవేళ ఏవైనా రాష్ట్రాలు వాటి పిడిఎస్ పరిధిని విస్తరించుకోవాలన్నా కూడా సాధ్యంకాదు. ఎందుకంటే రాష్ట్రాలు కేంద్రం విధించిన పరిధికి లోబడే విస్తరించుకోవాలి. పైగా ఆ విస్తరించిన కేటాయింపుకి అవసరమైన వనరులను కూడా తామే సమకూర్చుకోవాలి.

ప్రస్తుత చట్టం ప్రకారం తలసరికి అయిదు కేజిల చొప్పున, ఒక కుటుంబానికి నెలకు 25 కేజీల చొప్పున ఆహార ధాన్యాలను ఇస్తారు. అయితే ఈ పరిమాణంలో ఇచ్చే ధాన్యం ప్రజలు ఆరోగ్యవంతంగా జీవించటానికి, శరీర పోషణకి సరిపోవు.

ఈ చట్టం ద్వారా ఇచ్చే ఆహార ధాన్యాలకు చేసే ఖర్చు మీద కూడా దుష్ప్రచారం జరుగుతోంది. ఈ ఖర్చు దేశ ఆర్థిక స్థితిని ఇంకా దిగజారుస్తుందని. అయితే ఇది వాస్తవం కాదు. ఈ చట్టం కింద చేసే వ్యయం స్థూల జాతీయోత్పత్తిలో ఒక శాతం కూడా మించదు. ప్రభుత్వం ఈ చట్టం క్రింద చేసే ఖర్చుకు నిధులు పెంచనంతవరకు, ఆహార ధాన్యాల కోటా పెంచనంతవరకు, ఈ చట్టం ద్వారా "ఆహార భద్రత గ్యారంటీ" అని ప్రభుత్వం చేసే ప్రచారం బోలు వాగ్దానం అనేది తేటతెల్లం.

10వ జాతీయ మహాసభ కింద పేర్కొన్న డిమాండ్ల కోసం పోరాటం ఆరంభించాలని తీర్మానించింది.

(ప్రభుత్వం చెప్పుకుంటున్న దేమిటంటే ఈ చట్టం ద్వారా **75**శాతం మంది గ్రామీణ ప్రజలకి **50**శాతం పట్టణ ప్రజలకి సగటున **67** శాతం ప్రజలకి లబ్ధి చేకూరుతుందని, ఇది కచ్చితంగా అవాస్తవం. ప్రణాళికా సంఘం ఏర్పరచిన సూత్రాల ప్రకారం, అన్ని రాష్ట్రాల సగటును విభజిస్తే వచ్చిన జాతీయ సగటు ఇది. ఈచట్టం ఫలితంగా రాష్ట్రాలు వాటికి ఇంతకుముందు ఉన్న ప్రజా పంపిణీ వ్యవస్థ కేటాయింపుని కోల్పోతాయి. ఒకవేళ ఏవైనా రాష్ట్రాలు వాటి పిడిఎస్ పరిధిని విస్తరించుకోవాలన్నా కూడా సాధ్యంకాదు. ఎందుకంటే రాష్ట్రాలు కేంద్రం విధించిన పరిధికి లోబడే విస్తరించుకోవాలి. పైగా ఆ విస్తరించిన కేటాయింపుకి అవసరమైన వనరులను కూడా తామే సమకూర్చుకోవాలి.)

డిమాండ్లు:-

1. ఆహార భద్రతా చట్టం సార్వత్రికం చేయటం మరియు కనీసం 30 కేజీల ఆహార ధాన్యాలను ప్రజలకు కిలో రెండు రూపాయలకు మించకుండా అందజేయాలి.
2. ఆటో మాటిక్‌గా ఈ చట్ట పరిధిలోకి స్త్రీలు కుటుంబ పెద్దగా ఉన్న కుటుంబాలను, అసంఘటిత రంగంలో ఉన్న కుటుంబాలను, ఎన్.ఆర్.ఇ.జి.ఎ. శ్రామికులను, దళిత ప్రజలను, ప్రాజెక్టులు కట్టడం వలన నిర్వాసితులైన కుటుంబాలను, శారీరక, మానసిక వికలాంగులు కలిగిన కుటుంబాలను తీసుకురావాలి.
3. రాష్ట్రాలకు తమ ప్రజా పంపిణీ వ్యవస్థ విధానాలను, అనగా ప్రజా పంపిణీ వ్యవస్థ పరిధిని నిర్ణయించుకునేందుకు స్వతంత్రతని ఇవ్వాలి. మరియు కేంద్రం తన నిల్వలనుంచి అవసరమైనంత ఆహార ధాన్యాలను సబ్సిడీ కింద అందించాలి.
4. ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా చక్కెర, పప్పులు, మరియు వంట నూనెలను అవసరమైనంత పరిమాణంలో తక్కువ ధరకు ఇవ్వాలి.
5. ఆహార ధాన్యాలకు బదులుగా నగదు బదిలీ వద్దు.
6. రైతులు ఉత్పత్తిని పెంచటానికి మరియు ఉత్తమ పద్ధతుల్లో ధాన్య సేకరణ చేయటానికి ప్రభుత్వం సహాయం చేయాలి. పంటలకు సరియైన కనీస మద్దతుధర ఇవ్వాలి.
7. వార్షిక బడ్జెట్‌లో ఆహార సబ్సీడీ కోసం కేటాయింపులను అధికం చేయాలి.

☆

# ఐక్యతను దెబ్బతీసే మత తత్వశక్తులను వ్యతిరేకించండి

## తీర్మానం

**ఐద్వా 10వ జాతీయ మహాసభలు, బుద్ధగయా(బీహార్) నవంబర్ 21-25, 2013**

దేశంలోని వివిధ ప్రాంతాలలో పెరుగుతున్న మతహింస మరియు మత ఉద్రిక్త సంఘటనలపై ఐద్వా జాతీయ మహాసభ తీవ్రమైన ఆందోళన వ్యక్తం చేసింది. ప్రస్తుత తరుణంలో కుల సమీకరణలతో అధికార శ్రేణులలోని రాజకీయ పార్టీలు తమ పంథా మార్చుకొని కులసమీకరణలు, మత సమీకరణల ద్వారా రాజకీయాలు చేయటానికి ప్రయత్నం చేస్తున్నాయన్నది మనం అర్థం చేసుకోవటం అత్యంత ఆవశ్యకం. లోక్‌సభ ఎన్నికలు దగ్గరపడుతున్న తరుణంలో బి.జె.పి నరేంద్రమోడిని ప్రధాని అభ్యర్థిగా తెరమీదకి తెచ్చి, మతప్రాతిపదికన ఓట్ల కేంద్రీకరణకై ప్రణాళికాబద్ధంగా ప్రయత్నం చేస్తోంది. ఈ తరహా ప్రయత్నాల వలన మతపరమైన ఉద్రిక్తతలు చెలరేగుతాయనేది మనకిప్పుడు తేటతెల్లం. దేశంలోని వివిధ ప్రాంతాలలో ఈ ధోరణులు ప్రస్తుతం చెలరేగుతున్నాయి. ఇటీవల ముజఫర్ నగర్ (యూపి)లో జరిగిన భయానక మతకలహాలలో మైనార్టీ మతానికి చెందిన ఎనభైమందికి పైగా మృతి చెందారు. అట్లాగే యాభైవేలకు పైగా ప్రజలు నిర్వాసితులయ్యారు.

ఈ సంఘటనల ద్వారా మైనారిటీలలో ఆర్థిక, సామాజిక అసమానతలు, అన్యాయాలు మరియు హిందూత్వ శక్తుల దాడుల వలన పెరుగుతున్న అసంతృప్తులను ఉపయోగించుకుని మైనార్టీ మతతత్వ గ్రూపులు మైనార్టీల సమీకరణకై ప్రయత్నిస్తున్నాయి.

ఇటీవలి మత ఉద్రిక్త ఘటనలలో చోటుచేసుకుంటున్న కలవరపరిచే అంశమేమిటంటే, మతతత్వ శక్తులు మహిళలు, బాలికలపై జరుగుతున్న హింసని ఉపయోగించుకొని మత ఘర్షణలను ఎగదోస్తున్నాయి. అయితే విజయవంతంగా మత సమీకరణ జరిగిన తరువాత సానుకూలంగా జరిగిన హింసని మరచిపోతారు. కాని ఈ మత ఘర్షణలలో విశృంఖలంగా సాగే దాడులలో మహిళలే అత్యంత బాధితులు.

మైనార్టీ మతానికి చెందిన స్త్రీలు లైంగిక మరియు ఇతర రకాల హింసకి పావులుగా మారుతున్నారు. రెండు మతాలకు చెందిన యువతులు స్వేచ్ఛగా పాఠశాలలకు, కళాశాలలకు వెళ్ళలేరు, సాంఘిక కార్యకలాపాలలో పాల్గొనలేరు. ముజఫర్ నగర్ అల్లర్లలోనూ జరిగింది ఇదే. ఈ అల్లర్లలో స్త్రీలే అత్యంత బాధితులు, వాళ్ళు జీవన భృతిని పోగొట్టుకొని ఇళ్ళు, సామానులు దోపిడికి గురవటం వలన శరణార్థి క్యాంపులలో నిర్బంధంగా, హీనమైన పరిస్థితుల్లో జీవితాన్ని వెళ్ళదీస్తున్నారు.

**ఇటీవలి మత ఉద్రిక్త ఘటనలలో చోటుచేసుకుంటున్న కలవర పరిచే అంశమేమిటంటే, మతతత్వ శక్తులు మహిళలు, బాలికలపై జరుగుతున్న హింసని ఉపయోగించుకొని మత ఘర్షణలను ఎగదోస్తున్నాయి. అయితే విజయవంతంగా మత సమీకరణ జరిగిన తరువాత సానుకూలంగా జరిగిన హింసని మరచిపోతారు. కాని ఈ మత ఘర్షణలలో విశృంఖలంగా సాగే దాడులలో మహిళలే అత్యంత బాధితులు.**

మతతత్వ ఘర్షణలలో ఇంకో ప్రతికూల పరిణామం ఏమిటంటే సమాజంలో అంతర్గతంగా పితృస్వామిక భావజాలం పెరగటానికి తోడ్పడే వాతావరణం ఉత్పన్నమవుతోంది. తద్వారా మహిళలకు ప్రతిఘటించే శక్తిని తీవ్రంగా అణచి వేస్తోంది.

మహిళలుగా ఈ రోజు మనం అధికార పార్టీల నయా ఉదారవాద ఆర్థిక విధానాల దుష్పరిణామాలైన అధిక పేదరికం, ద్రవ్యోల్బణం మరియు నిరుద్యోగాన్ని ఎదుర్కొంటున్నాము. ఈ విధానాలపై పోరాటానికి అన్ని కులాలు, మతాల నుంచి మహిళలంతా విశాలంగా సంఘటితమవ్వాలి.

ఓట్ల కొరకు మతతత్వ శక్తులు మహిళల ఐక్యతను దెబ్బతీసేందుకు చేసే ప్రయత్నాలను తీవ్రంగా ప్రతిఘటించమని ఐద్వా 10వ జాతీయ మహాసభ పిలుపునిస్తోంది. దేశవ్యాప్తంగా ఉన్న మహిళలకు, ఐద్వా సభ్యులకు విభజన శక్తులకు వ్యతిరేకంగా పోరాడాలని మరియు లౌకిక వాద సూత్రాలను, రాజ్యాంగం ఇచ్చిన సమానత్వాన్ని నిలబెట్టుకోవటానికి కృషిచేయాలని మహాసభ పిలుపునిచ్చింది.

కథ

-పి. సత్యవతి




నది అవతలి ఒడ్డుకి ప్రయాణమౌతూ అద్దంలో చూసుకుంటే నా మొహం నాకే ఎంతో ముద్దొచ్చింది. ఉత్సాహంతో ఉరకలు వేసే వయసు. సమస్త జీవనకాంక్షలతో ఎగిసిపడే మనసు. ప్రపంచమంతా నాదేనన్న ధీమాతో వెలుగు దారాలతో రంగురంగుల పూలుకుట్టిన మూడు సంచులని భుజాన వేసుకుని, నాపాట నేస్తాన్ని నా పెదాలపై ఎప్పుడూ ఉండేలా ఒప్పించుకుని, ఈ ఒడ్డున నిలబడి, తూర్పు దిక్కునుంచి పాకి వస్తున్న సూర్యుణ్ణి విప్పారిన కళ్లతో చూస్తూ నిలబడ్డాను.

అప్పుడొక పడవ అటుగా వచ్చింది. నిండైన నదిలో అందంగా కనిపించింది. నడిపే అతను ముసిముసి నవ్వులతో ముచ్చటగా వున్నాడు.... "వస్తావా..." అన్నాడు.

"ఆ సంచులేమిటీ?" అని ఆరా తీశాడు.

"నా స్నేహాలు, నా అభిరుచులు, నా జ్ఞాపకాలు, నా ఆశయాలు, నా సరదాలు, నా నైపుణ్యాలు... నాకు మాత్రమే సంబంధించిన ఇంకా కొన్ని విశేషాలు"

"ఫరవాలేదు వచ్చేయ్...అవన్నీ నీ వెంట తెచ్చుకో! నీ తోడుగా వచ్చిన ఆ పాటని కూడా నీ పెదాల మీదే వుంచుకో... పడవెక్కడానికి నాచెయ్యి అందించనా.".

"ఏం వద్దు నేనెక్కగలను. ఆ మాటకొస్తే పడవ నడపటం నాకూ వచ్చు. అవునూ... ఎక్కడిదాకా నీ ప్రయాణం" అనడిగాను.

నాశక్తి మేరకు పడవ నడుపుతూ పోయి ఎక్కడ అలసిపోతే అక్కడ ఆగిపోతా.... నువ్వెక్కడ దిగిపోతానంటే అక్కడ దిగు" అన్నాడు. ఇదేదో బాగున్నట్లే అనిపించి "సరే పద" అన్నాను.

"నా పడవలోకి సుస్వాగతం" అన్నాడు నా కళ్లల్లోకి చూస్తూ, అతని కళ్లలో ఆశల దీపాలు కనిపించాయి. పడవెక్కాను. ఒక్కొక్క చోట ఒక్కొక్క తీరైన నదీ ప్రవాహం, దూరపు నీలికొండలు, ఒడ్డున పచ్చదనం, పైన నీలాకాశం, నా పెదవులపైనా పాట నేస్తం. ఉషారైన అతని ఈల. అతని మాటలు. వాటిలో అతని ఆశయాలు, అభిప్రాయాలు, కోరికలు, అతని చతుర్లు, అతని కూడా వచ్చిన పాటలు. అలల కలకల, మగత నిద్ర. ఈ ప్రయాణం ఇలా సాగిపోనీ... ఎంతకాలమైనా కానీ అనుకుంటూ పరవశంతో నా సహ ప్రయాణీకుణ్ణి. నా పడవ నడిపే ఆ చిన్నవాణ్ణి నా అంతరంగిక ప్రపంచంలోకి స్వాగతించాను. మనస్సు విప్పాను. గళం విప్పాను. మనశ్శరీరాల సాక్షిగా ఇద్దరం ఆవలి ఒడ్డుకి కలిసే ప్రయాణం చేద్దామని నిండునది ఎదుట పండు వెన్నెల్లో ప్రయాణం చేసుకున్నాం. అంతవరకూ చెరికాసేపూ తెడ్డు వేశామా ఇప్పుడతను నావైపు కైపుతో చూసి " నువ్వు కాసేపు విశ్రమించు ప్రియా! బాగా అలసిపోయావు. అలసిన నీ కళ్లల్లో మెరుపు తగ్గేను" అన్నాడు. అతని శ్రద్ధకి ఎంత ఆనందించానో!

నా నేస్తం పాడుతున్న ఒక ప్రణయగీతం వింటూ, ఒక్క క్షణం మత్తుగా కళ్లు మూశానో లేదో అతను అదృశ్యమయ్యాడు... నాపాట అతన్ని పిలిచింది. "వస్తున్నానుండు" అంటూ హడావిడిగా పరిగెత్తుకొచ్చాడు,

"ఎక్కడికెళ్ళావ్" అన్నాను కంగారుగా. "ఇంకా మనం చాలా దూరం పోవాలి కదా. ఇట్లా తెడ్డు వేసుకుంటూ కూర్చోడం విసుగ్గాలేదూ... అందుకని ఈ పడవ దానంతటదే సాగిపోవటానికి ఒక యంత్రం తయారు చేస్తున్నాను"

"యంత్రం పడవ నడిపితే నువ్వేం చేస్తావ్? నాకళ్లల్లోకి చూనస్తూ కూచుంటావా?"

"కాస్త నేల మీదకి దిగిరా తల్లీ, ఇప్పుడంటే వయసులో వున్నాం. ఇలా పడవ నడుపుకూంటూ పోతామా ఎల్లకాలం? మనకీ విశ్రాంతి కావాలి. సుఖవంతమైన జీవితం కావాలి. నువ్విలా ఎప్పుడూ ఎండకీ వానకీ కూచుని తెడ్డు వేస్తూ వుంటావా ? అందుకోసం నేనిప్పుడే కాస్త కష్టపడి ఏర్పాట్లు చేస్తున్నాను. మనం తీరం చేరి ఒక చక్కని ఇల్లు కట్టుకుని విశ్రాంతితో కూడిన నాణ్యమైన జీవనం గడపాలి కదా?"

"నాణ్యమైన జీవితమంటే....?

"తరువాత చెబుతాను గానీ ముందు ఆకలి సంగతి చూడు"

"నువ్వేం తేలేదా తినడానికి...."

"నేనీ యంత్రం తయారుచేసే వరకూ తిండి బాధ్యత నీదే. పడవ కాసేపు ఒడ్డున కట్టేసి తిండి ఏర్పాటు చూడు".

ఆవులిస్తూ లేచి కొంగునడుముకు బిగించాను.

"నువ్వేదో పనిమీద హడావిడిగా వున్నావ్‌గా, నేను కాసేపు అట్లా చల్లని గాలికి తిరిగొస్తా...' అని నాపాట నేస్తం వెళ్లిపోయింది.

" కాస్త నేల మీదకి దిగిరా తల్లీ, ఇప్పుడంటే వయసులో వున్నాం. ఇలా పడవ నడుపుకూంటూ పోతామా ఎల్లకాలం? మనకీ విశ్రాంతి కావాలి. సుఖవంతమైన జీవితం కావాలి. నువ్విలా ఎప్పుడూ ఎండకీ వానకీ కూచుని తెడ్డు వేస్తూ వుంటావా ? అందుకోసం నేనిప్పుడే కాస్త కష్టపడి ఏర్పాట్లు చేస్తున్నాను. మనం తీరం చేరి ఒక చక్కని ఇల్లు కట్టుకుని విశ్రాంతితో కూడిన నాణ్యమైన జీవనం గడపాలి కదా?"

"నీ ప్రియుడు చేస్తున్న శబ్దాలు విని భరించే ఓపిక లేదు. కొత్తలో ఆ శబ్దాలలో ఒక లయ ఉండేది. వాటితో పాటు నేనూ పాడేదాన్ని. ఇప్పుడది రణగొణ ధ్వనిలా మారిపోయింది... ఇప్పుడా యంత్రాల మోతే అయితే నా వల్ల కాదు... నే వెళ్తాస్తా. ఇప్పుడు కావాలంటే నీ కోసం కాసేపుంటా. పద అట్లా చెట్ల మధ్య కెళ్లి కాసేపు తిరిగొద్దాం" అంది.

"నీతో కలిసి పనిచేయ్యడం బాగుంటుంది. వెళ్లకు" అని పిలిస్తే "మళ్లీ వస్తాగా" అంటూ వినిపించుకోకుండా నేస్తం వెళ్లిపోయింది..

నా సఖుడికిప్పుడు నా పాట వినే తీరిక లేదు నన్ను ఆరాధనగా చూసే సమయమూ లేదు.నేను తిండి తయారు చెయ్యడానికి పడవ ఆపినప్పుడల్లా అతను చెట్లల్లో, పుట్టల్లో తిరిగి ఏదేదో తెచ్చి పడవ నింపేస్తున్నాడు. వాటన్నింటినీ పొందికగా సర్దమంటున్నాడు. పోగెయ్యడమే పనిగా పెట్టుకున్నాడు. అతని ఈ కార్యదీక్ష నన్నూ అబ్బురపరుస్తోంది. ఈమనిషి సమర్థుడు. శక్తిమంతుడు, ప్రేమాస్పదుడు...అని అతన్ని మరింత ఆరాధించడం మొదలు పెట్టాను. అతని కోసం మరింత శ్రద్ధగా వండడం, అతనికి విశ్రాంతి కల్పించడం కోసం పని పంచుకోడం అలవాటు చేసుకున్నాను. ఎటూ పడవ నడిపే యంత్రం తయారవుతోంది కదా. ఈ కొన్నాళ్ళూ నేనే తెడ్డు వేసి అతనికి మరింత సమయం కల్పిద్దామనుకున్నాను. ఇదంతా ఇష్టంతో, సంతోషంతో చేస్తున్నాను. పడవ రకరకాల వస్తువులతో నిండుతోంది. మేము ఆవల తీరానికి చేరి ఒక చక్కని ఇల్లు నిర్మించుకుని నాణ్యమైన సమయం గడవడానికి అవసరమైన ఇటుకలు, ఇంకా అనేక వస్తువులతో పడవ నిండిపోతుంది.... ఎప్పుడూ ఏదో ఒక శబ్దం. సుత్తులతో కొడుతూ, రంపాలతో కోస్తూ, సమ్మెట వేస్తూ...ఒకరోజు ఉలిక్కిపడి "అయ్యో నాపాట ఏమైంది... నా చిరకాల నేస్తం అప్పుడనగా వెళ్లి ఇదిగో వస్తానని మళ్లీ రాలేదేం" అనుకుని గొంతెత్తి గట్టిగా పిలిచాను. పిలవగా పిలవగా వచ్చింది. నా మీద అదివరకు చూపించే ఇష్టం తన గొంతులో దొరకలేదు నాకు.

"ఏమిటమ్మా అదే పోక పోయావు? పిలిస్తే గానీ వచ్చావు కాదు" అన్నాను. నిష్ఠూరంగా...

"నీ ప్రియుడు చేస్తున్న శబ్దాలు విని భరించే ఓపిక లేదు. కొత్తలో ఆ శబ్దాలలో ఒక లయ ఉండేది. వాటితో పాటు నేనూ పాడేదాన్ని. ఇప్పుడది రణగొణ ధ్వనిలా మారిపోయింది... ఇప్పుడా యంత్రాల మోతే అయితే నా వల్ల కాదు... నే వెళ్తాస్తా. ఇప్పుడు కావాలంటే నీ కోసం కాసేపుంటా. పద అట్లా చెట్ల మధ్య కెళ్లి కాసేపు తిరిగొద్దాం" అంది.

"అప్పుడప్పుడూ ఇట్లాగే వచ్చి నీకు సాంత్వన కలిగిస్తా గాని అచ్చంగా నీ పెదాల మీద మాత్రం ఈ హోరులో నేనుండలేను" అనేసి వెళ్లిపోయింది.

నన్ను పడవలోకి వెలుగు కళ్లతో ఆహ్వానించినవాడు, నన్ను చెయ్యిపట్టి పడవలోకి ఎక్కిస్తానన్నవాడు, ముసి ముసి నవ్వులతో ముచ్చటగా వున్నవాడు. నాకు తిండివేళ తప్ప కనిపించటమే లేదు. ఆ నవ్వులూ లేవు. ఆ ముచ్చట్లూ లేవు... ఏవేవో తెచ్చి పడవ నింపడం, తయారు చేయడంలో నిమగ్నమైపోయాడు. ఈ మధ్యనొక రోజు ఒక కొత్తదేదో తయారు చేస్తూ కనిపించాడు. అదేమిటని అడిగితే అది ఒక ఆయుధమని చెప్పాడు. మమ్మిల్ని మేము రక్షించుకోటానికట.

ఇక అతనితో కాదని నా పూర్వ స్నేహాలు, జ్ఞాపకాల సరదాలతో, నా జీవితాన్ని కొనసాగిద్దామని నేను తెచ్చుకున్న వెలుగుపూల సంచుల విప్పుకుందా మనుకుంటూ వాటికోసం వెతికాను. పడవంతా కలయ తిరిగాను.

ఒక్క సంచీ కనపడలేదు. ఇటుకల కింద, మేకుల డబ్బాల కింద, సుత్తుల కింద శాణాల కింద వాటికింద, వీటికింద, ఎక్కడ వెతికినా కనపడలేదు.

"అయ్యో!! ఏవీ నా స్నేహాలు, జ్ఞాపకాలు, నా అనుభవాలు, నా నైపుణ్యాలు? ఎక్కడ... ఎక్కడ" అని అక్రోశించాను. అతనిపై మోహంతో, ప్రేమతో నన్ను నేను మర్చిపోయానా? నా సంపదనంతా పోగొట్టుకున్నావా ?

"మనం సేకరించిన ఈ సంపదనంతా పడవలో నింపే క్రమంలో అవి అడ్డం వచ్చి వుంటాయి. నదిలో గిరాటేసి ఉంటాం" అన్నాడు నా సఖుడు చాలా తేలికగా... అలా అనేసి నా చెయ్యి పట్టుకొని పడవలో తన కార్ఖానాకి తీసుకుపోయి "ఇన్నాళ్ళ నా శ్రమ ఫలించింది. చూడు. ఇక నీకు పడవ నడిపే పనే లేదు.... హాయిగా విశ్రాంతి తీసుకో... పాపం చాలా కష్టపడ్డావు. చెంపల దగ్గర వెంట్రుకలు తెల్లబడ్డాయి. నేను గమనించలేదు. చూశావా ? నీ రంగు కూడా తగ్గింది. ఇక పడవ తనంతట తనే వెడుతుంది. నువ్వు నీ గురించి శ్రద్ధ తీసుకో..నాకు ఇంకాస్త పనుంది. నేను కనిపెట్టాల్సినవి,

సంపాదించవలసినవి కొన్ని మిగిలిపోయాయి.

నిజానికి సంపాదించింది చాల్లే. ఇక వీటితో మనం మంచి ఇల్లు కట్టుకుని హాయిగా ఉండొచ్చు అనుకుంటామా ఏదో ఒకటి మళ్లీ మిగిలి ఉంటుంది. ఇదిగో నీ చేతుల్తో ఈ మీట నొక్కు... ఆ తెడ్డు విసిరి నదిలో పడేయ్. ఇదొక్కటే కాదు. ఇంకా చాలా పనులు వాటంతటవే జరిగిపోయేలాగా చేసే యంత్రాలు తయారు చేస్తున్నాను. నీ పనల్లా అలా వేళ్లతో అలవోకగా మీటలు నొక్కటమే. ఇలా కాయకష్టంతో పనుండదు.

సరే ముందీ మీట నొక్కు అన్నాడు.

మీట నొక్కాను. పడవ వేగం పుంజుకుంది. నేను కూచున్నాను. నాపాట పోయింది. నావెలుగుపూల సంచులు పోయాయి. నానఖుడు ఎప్పుడు కనపడతాడో తెలీదు. ఇప్పుడు నాకు పడవనడిపే పని కూడా పోయింది.

"నేనేం చెయ్యాలిప్పుడు ? నా నైపుణ్యాలు పోయాయి. నేనూ నీతో నీ కార్ఖానాలో పనిచేస్తాను " అన్నాను.

" ఒద్దొద్దు.... నువ్వు విశ్రాంతి తీసుకో... చెదిరిపోతున్న నీ సౌందర్యం కాపాడుకో నాకు తిండి పెట్టు. నా అవసరాలు చూడు" అన్నాడు.

నీళ్లల్లో నా ముఖం చూసుకున్నాను. పాటలేని పెదవులు ఎండిపోయాయి, పడవెక్కినప్పుడు నాకే ముద్దొచ్చిన నా మొహం ఇప్పుడు అరిగిపోయినట్లుంది. పడవ రయ్‌మని నీళ్లని కోసుకుంటూ పరుగులు పెడుతోంది. రాను రాను బరువు కూడా పెరుగుతోంది.

పడవలో మా బంగారు భవిష్యత్తుకోసం, రాజాలాంటి బ్రతుకు కోసం అతనేమేమి నింపుతున్నాడో తెలీదు. అసలు నాకు చిన్నప్పటి నుంచీ ఈ రెండు పదాలూ ఇష్టం ఉండేది కాదు. రాజా లాగా బ్రతకటం అంటే పనిచెయ్యకుండా పదిమందితో కలవకుండా ఆధిక్యతతో వుండాలని కదా. అంటే రాజా ఒక్కడేనా మన నమూనా? అనిపించేది. 'బంగారంలాంటి' అనేమాట కూడా నాకిష్టం అనిపించేది కాదు. బంగారానికి పరిమళం, రుచీ లేదు. ఖరీదైన వస్తువులేనా మనం కోరుకోవలసినవి అనిపించేది. ఇప్పుడు నాప్రియసఖుడు కూడా తరచు ఈ రెండు పదాలే వాడుతూ నాకు విసుగు కలిగిస్తున్నాడు.

పడవ బరువు పెరుగుతోంది. శబ్దాల హోరు ఎక్కువైంది. పాటమ్మ ఏమైందో అయిపు లేకుండా పోయింది. సఖుని దర్శనం అపురూపమైంది. అసలు నేనెక్కడికి బయల్దేరాను.? ఏ ఉద్దేశ్యంతో బయలుదేరాను? ఏ గమ్యం కోరుకున్నాను? ఇతను పిలిచీ పిలవగానే సమ్మోహితురాలినై ఈ పడవలో ఎందుకు ప్రవేశించాను. అతనితో పంచుకున్న అనుభవాలు, చెప్పుకున్న ఊసులు, అన్నీ ఒక్కొక్కటే అదృశ్యమైపోయాయి. అవునూ అతగాడు... నన్ను తన నవ్వోహనాస్త్రంతో కట్టిపడేసినవాడు. తన నవ్వులతో నన్ను ఆకట్టుకున్నవాడు... నా పాటల్ని, నా స్నేహాల్ని పదిలంగా ఉంచుకోమని చెప్తూనే తన వస్తువుల కడ్డొచ్చాయని వాటిని నదిలోకి గిరాటు పెట్టినవాడు, నాకొక అద్భుత ప్రపంచం సృష్టిస్తానన్నవాడు, నేను నా ఆత్మనీ, నా శరీరాన్ని అర్పించుకున్నవాడు ఏడి?

ఎక్కడనుంచో సన్నగా మూలుగు వినపడుతోంది. ఈ పడవలో నేనూ, అతనూ తప్ప మరొకరెవరూ లేరే ! ఎవరిదా ఆక్రందన ? ఉలిక్కిపడి లేచాను. పడవ పరిగెడుతూనే ఉంది. తన బరువు తగ్గించమని పడవ అడిగినప్పుడల్లా కొత్తగా సంపాధించిన వస్తువులు, కనిపెట్టాల్సిన యంత్రాల తాలూకు సామాన్లు మాత్రం ఉంచి, పాత జ్ఞాపకాలు, అలవాట్లు ఒక్కొక్కటే గిరాటు పెట్టేస్తున్నాం. ఇప్పడిక పాతవేం లేవు. అన్నీ కొత్తవీ, పనికొచ్చేవే.....

ఎవరో గట్టిగా నవ్వారు ఎవరబ్బావాళ్లు ? అతనూ, నేనూ, యంత్రాలు తప్ప ఎవరూ లేరే అక్కడ... మరి నవ్విందెవరు? మూలిగిందెవరు?

" అవును కదా !! మరి నవ్వింది నేనే !! మూలిగేది ఎవరో తెలిసిపోలేదా ? " అంది పడవ నడుపుతున్న యంత్రం.

" ఇప్పుడు బరువైంది నువ్వే అందుకే నువ్వే దూకెయ్... నా మానాన నేను పోతాను " అంది కాసేపాగి.

" ముందు అతన్ని పిలు దూకితే ఇద్దరం కలిసే దూకుతాం. లేదా ఈ వస్తువులన్నీ గిరాటేసి మేమే హాయిగా తెడ్డు వేసుకుంటూ పోతాం ముందు నీ పీక నొక్కేస్తాం."

"అదిగో చూడు అతను తను తయారుచేసిన వస్తువుల మధ్య ఇరుక్కుపోయాడు. బయటకు రాలేక సతమతమైపోతున్నాడు. ఇక అతను వాటి మధ్య నించే కాదు. ఇంకా తయారుచేయ్యాలనే ఆశలోంచి కూడా బయటికి రాలేడు. అతనలా గింజుకుని గింజుకుని పోవాల్సిందే."

" అట్లా వీల్లేదు, ఇదిగో వస్తున్నా వుండు, నేనతన్ని బయటికి లాగుతాను. ఇన్నాళ్లూ నేనొక భ్రాంతిలో ఉండిపోయాను. అతను మొదటినించీ నన్నేదో విధంగా సమ్మోహన పరుస్తూనే ఉన్నాడు. నన్ను నా సౌందర్యం కాపాడుకోమన్నాడు. అతనంటే మాత్రం నేను గంగిరెద్దులా తల ఊపడమేనా? నా బాధ్యత మర్చిపోవడమేనా ? అతన్ని ఈ తయారీ దాహం నుంచి తప్పించే బాధ్యత నేనెందుకు తీసుకోలేదు.? అతనికి ముందు నుంచి నా భావాలు నా ఆశయాల గురించి నేనెందుకు అర్థం చేయించలేదు.? నా సంచులు నేనెందుకు పోగొట్టుకున్నాను. ? ఎంత అలసత్వం ప్రదర్శించాను ? నాకు నావన్నీ కావాలి. నా ప్రియసఖుడూ కావాలి."

" అతన్ని బయట పడెయ్యటం ఇప్పుడు నీ వల్ల కాదు. చిన్నప్పటినుంచీ నీ వెంట వున్న నీ పాట నేస్తాన్ని కూడా పొగొట్టుకున్నావ్.... ఇక ఎవరి సాయంతో అతన్ని బయటికి తీస్తావ్? అయినా నేను ఒక పరిమితమైన బరువు వరకే పడవని తేలిగ్గా పోనివ్వగలను. ఇప్పుడు నువ్వే నాకు బరువు. దిగి ఈదుకుంటూపోతావో మునిగిపోతావో నీ ఇష్టం.... త్వరగా కానీ! లేకపోతే నాతో సహా మొత్తం

మునిగిపోతుంది" అంది పడవ నడిపే యంత్రం.

నవ్వొచ్చింది... నేనూ, అతనూ లేకపోయాక ఇక పడవ మునిగితే నాకేంటీ? నడిస్తే నాకేంటీ ? అయినా అసలు పడవని యెందుకు మునగనివ్వాలి. ?

నేను నా గొంతునంతా ఉపయోగించి గట్టిగా నా పాట నేస్తాన్ని పిలిచాను. ఒక పొలికేక పెట్టాను. తనకి ఎంత దయో నా మీద .. వచ్చి నా పెదవుల మీద వాలింది. నా గుండెని శృతి చేసింది.

ఇద్దరం కలిసి బయలుదేరాం. యంత్రాల మధ్యకి, అంతులేని వస్తువుల మధ్యకి.. అతణ్ణి శోధించడానికి.... అతన్ని కాపాడుకోడానికి, అతని విలువైన ముఖ్యమైన పరిశోధనలతో సహా అతణ్ణి రక్షించుకోటానికి !!

నన్ను తన పడవలోకి స్వాగతించిన వాణ్ణి తిరిగి తెచ్చుకోడానికి... నావెలుగు పూల సంచుల్ని మళ్ళీ తయారు చేసుకోటానికి. పడవలో అవసరానికి మించిన ఆర్భాటాలన్నీ గిరాటేసి మళ్ళీ సంతృప్తికరమైన ఒక సుందర జీవితానికి నాంది పలకడానికి. అక్కర్లేని వస్తువులు తయారు చెయ్యకుండా జీవితంలో కొంచెం విశ్రాంతి, కొంచెం భావుకత, ఎంతో ప్రేమా, ఇతరుల గురించిన ఆలోచన ఉండేలా చూసుకోడానికి, వెలుగుపూల సంచులని విలువలతో నింపుకోడానికి...

నాకూ, నాపాటకీ ఆ శక్తి సామర్థ్యాలున్నాయని మాకిద్దరికీ ఎనలేని నమ్మకం.

నా నఖునిలాగే, అనేకానేక వ్యామోహాల్లో అత్యాశల మాయ జలతారు వలల్లో చిక్కుకుపోయిన తమ ప్రేయసుల కోసం చింతపడే ప్రియులు కూడా నాతో గొంతు కలిపితే మనం మన ప్రపంచాన్ని మరింత జీవనయోగ్యంగా మలుచుకోవచ్చు కదా. ●

పుస్తక పరిచయం

# మరో అమ్మ

-కె. ఉష




మదర్‌జోన్స్ జీవితం ఓ ప్రేమకథ. అవును. అది ఒక తల్లి ప్రేమ. తను కన్న పిల్లల్ని పోగొట్టుకుని, ఆ ప్రేమను మొత్తం కార్మికవర్గానికే పంచి ఇచ్చిన తల్లి ప్రేమ కథ. ఈప్రేమే ఆమెను కార్మికపక్షపాతిని చేసింది. మేరీ హారీస్ జోన్స్‌ను మదర్‌జోన్స్‌గా మార్చింది. ఆప్రేమే ఆమెను వారి జీవితాలలో మార్పు రావాలంటే పోరుబాట పట్టాల్సిందేనని పదేపదే చెప్పించింది.

అందుకే సిన్‌క్లేర్ అనే ఆమె జీవిత చరిత్రకారుడు.. 'ఆమె జీవితాంతం నిజమయిన విప్లవబాటలో పయనించిన బాటసారి'గా ఆమెను వర్ణించాడు. తన నలబయ్యవ వడిలో కార్మికోద్యమంలో అడుగుపెట్టిన ఆమె కార్మికవర్గంతో ఎంత మమేకమయిందంటే, ఆనాటి కార్మికవర్గం ఆమెలో తమ అమ్మను చూసుకుని 'అమ్మగా పిలుచుకున్నారు. ఆమెను 'మదర్‌జోన్స్'గా చేసారు. వారి పాలిట ఆమె తమ కష్టాలు కడతేర్చే దేవత. అందుకే యాజమాన్యాలకు ఆమె అంటేనే వెరపు. గుండెదడ. వారు ఆమెను అమెరికాలోనే అత్యంత ప్రమాదకరమయిన మహిళగా వర్ణించారు. ఒక సెనేటర్ అయితే ఏకంగా ఆమెను "ఆందోళనలకే అమ్మమ్మ" అన్నారు.

నాటి గనులు, ఇనుము, రాగి బొగ్గు, అమెరికాలోని అనేక ప్రాంతాలకు విస్తరించి ఉండడం, ఒక్కొక్క గనిలో వందలలో మాత్రమే కార్మికులు పని చేయడం, బానిస వ్యవస్థ ఇంకా పూర్తిగా తొలగిపోని స్థితి, ఏమాత్రం అభివృద్ధికాని సమాచార వ్యవస్థ, అంతంత మాత్రపు ప్రయాణ సౌకర్యాలు, ప్రజా వ్యతిరేక ప్రచార మాధ్యమం, చట్టాలూ, అధికారగణం, ఈ సవాళ్ళనన్నింటినీ హారీస్ జోన్స్ అధిగమించిన తీరు మనకెంతో స్ఫూర్తినిస్తుంది.

జోన్స్ మంచి వక్త. తన వక్తృత్వ సామర్థ్యంతో ఆమె లక్షలాది కార్మికులను చైతన్యవంతులను చేసారు. పదివేలుగా ఉండే గని కార్మికుల సభ్యత్వాన్ని మూడు లక్షలకు పెంచారు. కార్మికశక్తి సంఘటిత శక్తి అని నమ్మి కార్మికులను సంఘటితం చేసేందుకు అహరహం కృషి చేసారు. సంఘటితమయిన కార్మికులను పోరాటబాట పట్టించారు. ఆమె ప్రథమ పాత్ర వహించి నడిపిన సమ్మెలు కొన్ని మచ్చుకు :-1877లో రైలు రోడ్డు కార్మికుల సమ్మె 1902, 1914లో అతిపెద్ద గని కార్మికుల సమ్మెలు, 1909 లో దుస్తుల పరిశ్రమలో సమ్మె, 1912 లో నేత కార్మికుల సమ్మె, 1920లోని ఇల్లినోయిస్ సమ్మె, అమెరికన్ కార్మికవర్గ చరిత్రలోనే అతి ముఖ్యమైన ఘట్టాలు.

బాల కార్మికుల కోసం ఆమె చేసిన పోరాటాలు మరపురానివి. మొత్తం ప్రపంచ ప్రజలందరి దృష్టిని బాల కార్మికుల సమస్యలవైపు ఆకర్షించగలిగారు. తమ బాల్యాన్నే మూల్యంగా చెల్లించి సంపన్నులను మరింత సంపన్నులను ఎలా చేస్తున్నారో వివరించారు. 14 సం॥ల వయసు వరకు పిల్లల బాల్యాన్ని కాపాడే చట్టాలు తెచ్చేందుకు కృషి చేసారు. తన నల్గురు బిడ్డలను ఒక్కసారే కోల్పోయిన ఆమె తన మాతృత్వాన్ని కార్మికులందరికీ పంచారు. కార్మికులందరి బిడ్డల మెరుగయిన జీవితాల కోసం పోరాడి ముందు తరాలకు స్ఫూర్తినిచ్చారు.

ఆమె ధైర్యం, తెగువ, దీక్ష దక్షత, నిజాయితీ, నిబద్ధత ఇవన్నీ మనల్ని ఎంతో ఉత్తేజితులని చేస్తాయి. ఈ స్ఫూర్తే ఈ పుస్తకం ద్వారా అశేష ఆంధ్ర ప్రజానీకానికి ఆమెను పరిచయం చేయాలన్న కోరికను కల్పించింది. ఫలితమే ఈ పుస్తకం.

# శ్యామిలీ గుప్తాకు నివాళి

ఐద్వా జాతీయ నేతగా, పశ్చిమబెంగాల్ గణతాంత్రిక్ మహిళా సమితిలోను సుదీర్ఘకాలం పనిచేసిన శ్యామిలీ గుప్తా నవంబర్ 25న కోల్‌కత్తాలో గుండెపోటుతో మరణించారు. ఆమె మృతి మహిళా ఉద్యమానికి తీరనిలోటు. శ్యామిలికి ఐద్వా, చైతన్యమానవి అశ్రు నివాళులు అర్పిస్తోంది.

2013 నవంబర్ 22న ఐద్వా జాతీయ మహాసభకు కోల్‌కత్తా నుండి బుద్ధగయకు చేరుకున్న శ్యామిలీ గుప్తా రైల్వేస్టేషన్‌లో తూలి పడడంతో తలకు గాయాలయ్యాయి. గాయాలతోనే మహాసభ ప్రాంగణానికి చేరుకున్నారు. 22వ తేది ఉదయం 10గం॥లకు మగధ యూనివర్శిటీ ఆవరణలో 23 రాష్ట్రాల నుండి హాజరైన 761మంది ప్రతినిధుల జైజై నినాదాల మధ్య శ్యామిలీ గుప్తా పతాకావిష్కరణ చేసి అమరవీరుల స్థూపానికి శ్రద్ధాంజలి ఘటించారు. అనంతరం ప్రారంభ సభలో అధ్యక్షోపన్యాసం చేశారు. 24వ తేది కలకత్తాకు తిరిగి పయనమవటంతో మహాసభ ఘనంగా వీడ్కోలు పలికింది. ఆమె సభలో చేసిన ప్రసంగంలో "మహిళా ఉద్యమం మరింత బలపడాలి, నరళీకరణ విధానాలు మహిళలపై భారాలు పెరుగుతున్నాయి.

మరోప్రక్క మహిళలపై బహురూపాలలో హింస పెరుగుతోంది. వీటికి వ్యతిరేకంగా మహిళలను సమీకరించి సంఘటిత పోరాటాలు నిర్వహించాలని, కార్యకర్తలను గుర్తించి తర్ఫీదు ఇవ్వాలని" అన్నారు. అదే తన చివరి ప్రసంగం. 25వ తేది మహాసభ నూతన కమిటి ఎన్నిక జరుగుతున్న సమయంలో శ్యామిలీ గుప్తా అసువులుబాశారనే వార్త ప్రతినిధులను దిగ్భ్రాంతికి గురిచేసింది. 24న సభలో ప్రసంగించిన ఆమె ఇక లేరనే చేదు వార్త అందర్నీ కంటతడి పెట్టించింది.

శ్యామిలీ గుప్తా జాదవ్‌పూర్ కాలేజీలో డిగ్రీ పూర్తి చేసి కలకత్తా యూనివర్శిటిలో ఎమ్.ఏ. పొలిటికల్ సైన్స్ పూర్తి చేశారు. 1960 నుండే విద్యార్థి ఉద్యమాలలో క్రియాశీల కార్యకర్తగా అనేక పోరాటాలలో పాల్గొన్నారు. 1963 సంవత్సరంలో (18సం॥రాల వయస్సు) అవిభక్త కమ్యూనిస్టు పార్టీలో సభ్యత్వం తీసుకున్నారు. 1964 చీలిక అనంతరం సిపిఐఎమ్ పార్టీలో చేరారు. సిపియం పార్టీ రాష్ట్ర కమిటీ సభ్యులుగా, 2002 నుండి కేంద్ర కమిటీ సభ్యులుగా వున్నారు. చనిపోయేనాటికి తన రాజకీయ ప్రవేశం జరిగి 50 వసంతాలు పూర్తి అయింది. 1966లో అప్పటికే పూర్తికాలం కార్యకర్తగా పనిచేస్తున్న శంకర్‌గుప్తాను భాగస్వామిగా ఎంచుకున్నారు. ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగుతూనే విద్యార్థి, మహిళా, ప్రజాతంత్ర ఉద్యమాలలో చురుకైన పాత్ర వహించారు.

1980లో జాదవ్‌పూర్ నుండి కోల్‌కత్తా కేంద్రానికి మకాం మార్చిన తర్వాత మహిళా ఉద్యమంలో ప్రధాన పాత్ర పోషించారు. 1983లో భర్త శంకర్ గుప్తా ఆకస్మిక మరణం శ్యామిలీని కృంగదీసినా మొక్కవోని ధైర్యంతో బిడ్డను వెంట తీసుకుని ఉద్యమాలలో పాల్గొన్నారు. ప్రస్తుతం కుమారుడు సోమ్‌షుభ్రా తల్లి దండ్రుల అడుగు జాడలలో ప్రజాతంత్ర ఉద్యమాలలో పని చేస్తున్నారు.

1982-1995 వరకు పశ్చిమబెంగాల్ గణతాంత్రిక మహిళా సమితి కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు. 1981లో ఐద్వా ఏర్పడిన నాటి నుండి వర్కింగ్ ప్రెసిడెంట్‌గా, కార్యదర్శిగా, అధ్యక్షురాలిగా పలు బాధ్యతల్లో వున్నారు. అఖిల భారత సెంటర్‌లో విధాన నిర్ణయాలలో ఆమె పాత్ర అమోఘం. రాజకీయ పరిస్థితులను వర్గ దృక్పథంతో విశ్లేషణ చేయటంలోనూ వాటిని కార్యరూపంలోకి తేవటంలోనూ ప్రత్యేక భూమిక నిర్వహించారు. మహిళగా, వర్గ మహిళగా, పౌరురాలిగా ఎదుర్కొనే సమస్యలను రోజువారీ ఐద్వా కార్యక్రమాలలోనూ, తన ప్రసంగాలు, రచనలలోనూ ప్రతిబింబించేవారు. కోల్‌కత్తాలో శ్యామిలీ చొరవతో మహిళా



న్యాయసలహా సంఘాన్ని ఏర్పాటు చేయటమేగాక, తీరిక సమయంలో స్వయంగా కౌన్సిలింగ్ సెంటర్‌కి హాజరై బాధితుల సమస్యలను విని పరిష్కారం చూపేవారు.

శ్యామిలీ అఖిల భారత కార్యదర్శిగా పనిచేసిన సమయంలో ఆంధ్ర ప్రదేశ్‌కు రెండు సార్లు వచ్చారు. గుంటూరు జిల్లా అమరావతిలో మహిళపై అత్యాచార ఘటన జరిగినపుడు బాధితులను పరామర్శించి ధైర్యం చెప్పడంతోపాటు నిందితులను కఠినంగా శిక్షించాలని డిమాండ్ చేశారు. పశ్చిమగోదావరి జిల్లాలోని ఏలూరులో మహిళా సంఘం కార్యకర్త తాన్న సింహాచలంను స్థానిక గూండాలు హత్య చేసినపుడు ఆ కుటుంబాన్ని పరామర్శించడంతో పాటు కార్యకర్తల్లో మనో ధైర్యాన్ని నింపారు. మహిళా సమస్యలపై దేశంలోని ఏమూలకైనా వెళ్ళడానికి సంసిద్ధులయ్యేవారు.

కార్యకర్తలను గుర్తించటం, వారితో ఆప్యాయంగా మెలగటం, వారి సమస్యలు,

అవసరాలు గమనించి పరిష్కరించటంలో శ్యామిలీ మిక్కిలి శ్రద్ధ చూపేవారు. నిర్బంధాలు, దాడులకు గురైన కుటుంబాలను పరామర్శించి వారికి కావల్సిన సహాయ సహకారాలు అందించేవారు. 50సం॥ల ఆమె రాజకీయ జీవితం నిబద్ధతతో కొనసాగింది. నిరాడంబరత, కార్యదీక్ష, క్యాడర్‌తో మమేకమైన తీరు ఆమెనుండి నేర్చుకోవాల్సిన పాఠాలు.

50 సంవత్సరాల పాటు సుదీర్ఘ రాజకీయ జీవితంలో అనేక ఆటుపోట్లు ఎదుర్కొని ఉద్యమమే ఊపిరిగా చివరికంటూ నిలబడ్డారు. తృణమూల్ కాంగ్రెస్ ముష్కరులు ప్రస్తుతం ప్రజాతంత్ర ఉద్యమంపై చేస్తున్న దాడిని త్రిప్పికొట్టడంలో క్యాడర్‌ను కాపాడుకునేందుకు జరుగుతున్న కృషిలో ఆమె పాత్ర శ్లాఘనీయమైంది.

శ్యామిలీదీ అని ఆప్యాయంగా ఆమెను ప్రజలు పిలుచుకుంటారు. ఎల్లప్పుడు చిరునవ్వుతో ఆహ్లాదంగా వుండేవారు. శ్యామిలీ మంచి రచయిత. బెంగాలీలో తాను రాసిన అనేక గ్రంథాలు వెలువడ్డాయి. ఏక్‌సాథీ మహిళా మాసపత్రికకు ఎడిటర్‌గా వున్నారు.

ఇన్ని సుగుణాలు వున్న వ్యక్తులు బహు అరుదుగా వుంటారు. శ్యామిలీ ఆకాల మరణం యావత్తు మహిళా ఉద్యమానికి తీరనినష్టం. ఆమె ఆశయ సాధనకొరకు కంకణ బద్ధులం కావటమే మనం ఆమెకు యిచ్చే నివాళులు.

– మానవి డెస్క్

# పోరాట విజయం

–కె. ఆశాలత

2001లో ఐద్వా ఇంటి పనివారిని (పని మనుషులుగా పిలువబడుతున్నారు) సంఘటితం చేసేందుకు స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘాన్ని ప్రారంభించింది. గౌరవం, ఐక్యత, సామాజిక న్యాయం అనే అంశాలను సంఘ ఆశయాలుగా మలుచుకుంది. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని పట్టణాలలో లక్షల సంఖ్యలో ఇంటిపనివారు ఉన్నారు.

గ్రామాల్లో వంటలు పండక, చేద్దామంటే పనులు దొరక్క పట్టణాలకు కుటుంబాల వలసలు పెరుగుతున్నాయి. ఆ రకంగా వలసలు వచ్చిన వారిలో మగవారు రోజు కూలీలుగా, అసంఘటిత రంగ కార్మికులుగా మారుతుంటే మహిళలు ఇంటి పనివారుగా రూపాంతరం చెందుతున్నారు.

ఇంటి పనివారికి ప్రభుత్వమే గుర్తింపు కార్డులివ్వాలని, ఇ.ఎస్.ఐ. సౌకర్యం కల్పించాలని, ఇళ్లు, ఇళ్ల స్థలాలు కేటాయించాలని, నెలకు 4 రోజులు సెలవులు ఇవ్వాలని, అవమానాలు, వేధింపులు అరికట్టాలని తదితర డిమాండ్లతో స్నేహ ఇంటిపనివారల సంక్షేమ సంఘం రాష్ట్ర వ్యాప్తంగా పెద్ద ఎత్తున ఆందోళనలు, ఉద్యమాలు నడిపింది. ప్రభుత్వంతో రాయభారాలు నడిపింది. ఫలితంగా


Andhra Pradesh State Social Security Board for Unorganized Workers
Provisional Identity Card

| | |
|---|---|
| Regn.No : | 16130020000158 |
| Worker Name : | KUNTI NAGAMANI |
| Father/Husband Name : | KUNTI SAMDAS |
| Date Of Birth / Age : | 35 |
| Aadhar Number : | WA[illegible]875587A0175 |
| Source Of Identification : | Ration Card |

2008లో ఇంటి పనివాళ్ళను కార్మికులుగా గుర్తిస్తూ 4 రోజులు సెలవులు వర్తింపచేస్తూ కనీస వేతన చట్టం సాధించుకున్నాము. పెరుగుతున్న ధరలకనుగుణంగా 2011లో కనీసం వేతనాల జీవోను సవరిస్తూ ప్రభుత్వం చట్టం తెచ్చింది.



ఇంటి పనివారిపై పెరుగుతున్న అవమానాలు, వేధింపులకు వ్యతిరేకంగా వారికి అండగా నిలబడింది స్నేహ ఇంటిపనివారల సంక్షేమ సంఘం. హైదరాబాద్ నగరంలో పనిచేస్తున్న ఇంటిపనివారి కోసం ప్రభుత్వం "ప్రయోగాత్మక ప్రాజెక్టుగా నగరంలో ఆమ్ ఆద్మీ బీమా యోజన పథకం" ప్రవేశపెట్టింది.

**వివరాలు:–**

1. ఈ పథకంలో సంవత్సరానికి సభ్యులు 100రూ॥లు కట్టాలి. కేంద్ర ప్రభుత్వం తన వాటాగా 100రూ॥లు కడుతుంది. ఈ పథకం ప్రకారం సహజ మరణం జరిగితే సభ్యునికి 20,000రూ॥లు.

2. యాక్సిడెంటల్ మరణానికి 1,00,000రూ॥లు ఇన్సూరెన్స్ చెల్లిస్తారు.

3. యాక్సిడెంట్‌లో కాలికి, చేతికి దెబ్బలు తగిలితే 37,500రూ॥లు.

4. యాక్సిడెంట్‌కు గురి అయి కాళ్లు కాని, చేతులు కాని అస్సలు పనిచేయకపోతే 75,000రూ॥లు చెల్లిస్తారు.

5. కుటుంబంలో 9వ తరగతి నుండి ఇంటర్ వరకు చదువుకునే పిల్లలుంటే వారికి సం॥నికి 2,400రూ॥లు ఒక్కొక్కరికి స్కాలర్‌షిప్ చెల్లిస్తారు. 18 సంవత్సరాల వయస్సు నుండి 59 సంవత్సరాల వయస్సులో ఉన్న వారు ఈ పథకానికి అర్హులు.

ఐద్వా గత అనేక సంవత్సరాలుగా చేసిన కృషి ఫలితంగా ఇంటి పనివారిని ప్రభుత్వం కార్మికులుగా గుర్తించడంతోపాటు వారికి గుర్తింపు కార్డులు ఇచ్చి ఇన్సూరెన్స్ పథకం వర్తింపచేసింది. ఇది స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం సాధించిన విజయం. డిశంబర్ 10, 2013 మానవ హక్కుల దినం రోజున ప్రభుత్వం ఇంటి పనివారికి గుర్తింపు కార్డులు జారీ చెయ్యడం ముదావహం.

తెహెల్కా కేసు నేపథ్యంలో

# లైంగిక వేధింపుల సమస్యలు

-బృందాకరత్

తన ఎడిటర్-ఇన్-చీఫ్ తరుణ్ తేజ్‌పాల్‌పై వచ్చిన లైంగిక దాడి ఆరోపణల తీవ్రతను దాచిపెట్టడానికి 'తెహెల్కా' ప్రయత్నాలు చేస్తోంది. సవరించిన భారతీయ శిక్షా స్మృతి (ఐపిసి) ప్రకారం లైంగిక దాడి అంటే అత్యాచారంతో సమానం. పని ప్రదేశాల్లో మహిళలను రక్షించేందుకు ఉద్దేశించిన 2013 చట్టం తప్పనిసరి చేసిన అంతర్గత కమిటీతో విచారణ జరిపించడం ద్వారా ఈ కేసు నుంచి అందరి దృష్టిని మళ్లించేందుకు తెహెల్కా ప్రయత్నించింది. 2013 చట్టం తక్కువ తీవ్రత గల లైంగిక వేధింపులను చేపడుతుంది. ఈ చట్టం కింద ఇటువంటి నేరాలు కేసు పెట్టదగినవి కాదు. పైగా నిబంధనలు రూపొందించడంలో ప్రభుత్వం విఫలం కావడంతో ఈ చట్టం అసంపూర్ణంగా మిగిలిపోయింది. పని సంబంధమైన బాధ్యతలు నిర్వర్తిస్తుండగా మహిళా ఉద్యోగిపై లైంగిక వేధింపులకు పాల్పడినందుకు తెహెల్కా మేగజైన్ ఎడిటర్ -ఇన్-చీఫ్ తరుణ్ తేజ్‌పాల్‌కు వ్యతిరేకంగా ఎఫ్ఐఆర్‌ను దాఖలు చేయడం ద్వారా గోవా ప్రభుత్వం, పోలీసులు సరైన చర్య తీసుకున్నారు. లైంగిక దాడులు కేసుపెట్టదగిన నేరాలు. అటువంటి నేరానికి



సంబంధించిన సమాచారం బహిరంగంగా వెల్లడైతే దానిపై చర్య తీసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వానికుంది. తెహెల్కా ఎప్పుడూ మహిళలు, సమాజంలో అణచివేతకు గురైన ఇతర వర్గాల హక్కుల గురించి పోరాడుతూ ఉంటుంది. అలాంటి తెహెల్కా గురించి ఇటువంటి వార్త వినగానే ఒక్కసారి తెహెల్కా అభిమానులు దిగ్భ్రాంతికి గురయ్యారు. సంస్థ నైతికంగా ఇలా కుప్పకూలడం పట్ల ఆగ్రహం వ్యక్తం చేశారు. ఇతరులకు ఎలాంటి ప్రమాణాలు ఉండాలని అది డిమాండ్ చేస్తోందో, పోరాడుతోందో ముందుగా ఆ ప్రమాణాలు ఇక్కడ అనుసరించాలని వారు కోరారు.

ఆ నేర స్వభావం కారణంగా తరచుగా లైంగిక వేధింపుల గురించి బయటకు సమాచారం రాకుండానే పోతూ ఉంటుంది. అలాగే లైంగిక నేరం గురించి వెల్లడించాలంటే ముందు ఆ బాధితురాలు మాట్లాడగలిగే స్థితిలో ఉన్నారా లేదా అనే దానిపై కూడా ఆధారపడి ఉంటుంది. పైగా సమాజంలో అత్యంత హీనమైన నేరంగా పరిగణించే ఇటువంటి వాటి గురించి పెద్దగా బయటకు రాకపోవడం దిగ్భ్రాంతికరమైన మరో వాస్తవం. ఇలా కారణాలెన్నో ఉన్నాయి. బాధితులకు సామాజికంగా కళంకం అంటగడతారనే భయం, బాధాకరంగా ఉండే న్యాయ ప్రక్రియలు

ఆ నేర స్వభావం కారణంగా తరచుగా లైంగిక వేధింపుల గురించి బయటకు సమాచారం రాకుండానే పోతూ ఉంటుంది. అలాగే లైంగిక నేరం గురించి వెల్లడించాలంటే ముందు ఆ బాధితురాలు మాట్లాడగలిగే స్థితిలో ఉన్నారా లేదా అనే దానిపై కూడా ఆధారపడి ఉంటుంది. పైగా సమాజంలో అత్యంత హీనమైన నేరంగా పరిగణించే ఇటువంటి వాటి గురించి పెద్దగా బయటకు రాకపోవడం దిగ్భ్రాంతికరమైన మరో వాస్తవం.

**వాస్తవానికి అవసరమైన నియమ నిబంధనలను రూపొందించడంలో కేంద్ర ప్రభుత్వం విఫలం కావడంతో ఈ చట్టం అసంపూర్ణంగా మిగిలింది. అయితే తెహెల్కాలో అంతర్గత కమిటీ లేకపోవడంతో వెంటనే మరుసటి రోజుకల్లా కమిటీని ఏర్పాటు చేశారు. యువ మహిళా జర్నలిస్టు ఇబ్బందిని పరిష్కరించడానికి తెహెల్కా సీరియస్‌గా చేసిన ప్రయత్నమేదైనా ఉంటే ఇదే.**

కావచ్చు. ప్రభుత్వాధికారుల శత్రు వైఖరి, బాధితురాలిని ఇంకా ఈ కేసులు గట్రాతో బాధించడం ఇష్టం లేక కుటుంబ సభ్యులు, స్నేహితులు వెనుకాడడం వంటి మరికొన్ని కారణాలు ఈ నేరంపై ఎక్కువగా మౌనం పాటించడానికి దోహదపడుతున్నాయి. ఫలితంగా నేరానికి పాల్పడిన వ్యక్తికి ప్రయోజనకరంగా పరిణమిస్తోంది. శ్రామిక మహిళకు సంబంధించిన కేసులో ఆమె దాదాపుగా ఒక పురుషునికి కింది స్థాయి ఉద్యోగిగానే ఎక్కువగా పనిచేయాల్సి ఉంటుంది. ఆ వ్యక్తి ఆమెను లైంగికంగా వేధిస్తాడు. ఆ నేరం గురించి ఫిర్యాదు చేస్తే ఎదురయ్యే పలు సమస్యలతో పాటు తన జీవన భృతి కూడా పోతుందనే భయం కూడా ఉంటోంది. అన్ని కేసుల్లోనూ జరుగుతున్నదే. తన బాస్‌కు వ్యతిరేకంగా లైంగిక వేధింపుల గురించి ఫిర్యాదు చేయడానికి సాహసించిన మహిళ ఖచ్చితంగా ఉద్యోగాన్ని కోల్పోవాల్సిందే.

ఈ తెహెల్కా కేసులో యువ మహిళా జర్నలిస్టు అసమానమైన ధైర్యంతో తనపై వేధింపుల గురించి ద్వితీయ శ్రేణి నాయకత్వం అయిన మేనేజింగ్ ఎడిటర్ సోమా చౌదరికి తెలియజేశారు. కానీ ఆమె నమ్మిన వారే ఆమెను మోసం చేశారు. తేజ్‌పాల్ చేత క్షమాపణ చెప్పించే తంతును ఆమోదించడం, అతడి నేరాన్ని కప్పిపుచ్చడం, తేజ్‌పాల్ తనకు తానుగా నిర్ణయించి, వేసుకున్న ఆరు నెలల సెలవు అనే శిక్షలో ఏదో ఒకదాన్ని ఆమోదించాల్సిందిగా ఆమెపై ఒత్తిడి తెచ్చారు. పైగా అడిగినదానికన్నా ఎక్కువే ఇది' అని ప్రకటన చేయడం ద్వారా ఆమె (సోమాచౌదరి) తన నిర్ణయాన్ని సమర్థించుకున్నారు. పైగా అంతా అయిన తర్వాత, అతను క్షమాపణ చెప్పడమే కాదు, ప్రాయశ్చిత్తం కూడా చేసుకున్నారు. ఆరు మాసాలపాటు చీఫ్ బాస్‌గా వ్యవహరించబోరని అన్నారు. భారతదేశంలోని జైళ్ళలో మగ్గుతున్న ఇతర రేపిస్ట్‌లు ఇలాంటి వైఖరితో లబ్ధిపొందవచ్చు. తాము చేసిన నేరానికి క్షమాపణలు చెప్పేందుకు బాధితుల ఇళ్ళ ముందు క్యూలు కడతారు. నెలల తరబడి ప్రాయశ్చిత్తాలు చేసుకుంటామని హామీలు గుమ్మరిస్తారు. వీరు చేసిన నేరానికి చట్టాన్ని దాని పర్యవసానాలను ఎదుర్కొనడం కన్నా కూడా వీరికిష్టమైన స్నేహితులు, కుటుంబ సభ్యుల మధ్య ప్రాయశ్చిత్తం చేసుకోవడం చాలా సులభం కదా!

**అత్యాచార నేరం**

ఎలాంటి పొరపాటు చేయకుండా బాధితురాలి ఫిర్యాదు మేరకు చూసినట్లైతే సవరించిన భారతీయ శిక్షా స్మృతి సెక్షన్ 375బిలోని అత్యాచారం నిర్వచనాన్ని వివరణ 1తో కలిపి చదివిన దాని ప్రకారం,

**'లైంగిక వేధింపులు' అన్న పదానికి చట్టంలో నిర్వచనం చాలా స్పష్టంగా ఉంది. 'శారీరక సంబంధం లేదా మరింత పురోగమించడం' నుంచి లైంగికంగా సహకరించాల్సిందిగా చేసే అభ్యర్థన' వరకూ లేదా ఎదుటివారికి తన కోరికను తెలియచెప్పేలా వ్యాఖ్యలు చేయడం కూడా ఈ పరిధి కిందికే వస్తాయి. ఇవన్నీ కూడా నేరాలే.**

ఆ నేరం గనక రుజువైతే నిందితుడికి కనీసం ఏడేళ్ళపాటు శిక్ష పడుతుంది. పైగా, సవరించిన చట్టం ప్రకారం, ఐపిసిలోని సెక్షన్ 376 (2) (ఎఫ్) కింద అత్యాచారానికి పాల్పడింది బంధువు, సంరక్షకుడు, ఉపాధ్యాయుడు లేదా నమ్మిన, అధికారం గల వ్యక్తి అయినా సెక్షన్ 376 (2) (కె) కింద ఒక మహిళను అదుపు చేయగల లేదా ఆధిపత్యం చెలాయించగల స్థితిలో ఉన్న వ్యక్తి అత్యాచారానికి పాల్పడితే ఆ నేరాన్ని అత్యాచారపు తీవ్ర రూపంగా పరిగణిస్తారు. శిక్షను కూడా కనీసం పదేళ్ళకు పెంచుతారు. ఇప్పుడు తెహెల్కా కేసు ఈ నిబంధనలకు అనుగుణంగా ఉంది. ఈ నేరం తీవ్రతను దాచిపెట్టడానికి తెహెల్కా మరో రకంగా కూడా ప్రయత్నించింది. పైగా అనేక టెలివిజన్ ఛానళ్ళలో చర్చా కార్యక్రమాల్లో పాల్గొని తమ అభిప్రాయాలను వినిపించిన కొంతమంది మహిళా కార్యకర్తలు, మహిళా లాయర్లు ఈ మోసపూరిత క్రమంలో భాగస్వాములు కావడం విచారించదగ్గ విషయం. అయితే పని ప్రదేశాల్లో లైంగిక వేధింపులకు వ్యతిరేకంగా చట్టం నిర్దేశించినట్లుగా అంతర్గత కమిటీ ముందే ఈ కేసును నివేదించడానికి ఫిర్యాది ప్రాధాన్యతనిచ్చారు. వాస్తవానికి అవసరమైన నియమ నిబంధనలను రూపొందించడంలో కేంద్ర ప్రభుత్వం విఫలం కావడంతో ఈ చట్టం అసంపూర్ణంగా మిగిలింది. అయితే తెహెల్కాలో అంతర్గత కమిటీ లేకపోవడంతో వెంటనే మరుసటి రోజుకల్లా కమిటీని ఏర్పాటు చేశారు. యువ మహిళా జర్నలిస్టు ఇబ్బందిని పరిష్కరించడానికి తెహెల్కా సీరియస్‌గా చేసిన ప్రయత్నమేదైనా ఉంటే ఇదే.

**2013 చట్టం పరిధి**

పని ప్రదేశాల్లో మహిళల లైంగిక వేధింపుల (నివారణ, నిషేదం, పరిష్కారం)

చట్టం 2013గా పేర్కొనే ఈ చట్టం సుప్రీం కోర్టు ఇచ్చిన విశాఖ జడ్జిమెంట్ ప్రాతిపదికగా రూపొందింది. ఒకవేళ తక్కువ స్థాయి తీవ్రత కలిగిన లైంగిక వేధింపుల కేసుల్లో అయితే (ఇలాంటి కేసులు ఐపిసిలోని అత్యాచార వ్యతిరేక క్లాజులోకి వస్తాయి.) కోర్టు కేసులకు సంబంధించిన సుదీర్ఘ పద్ధతులు, నియమనిబంధనలు అనుసరించకుండా మహిళా ఉద్యోగులు సత్వర న్యాయం పొందేందుకు వీలుగా ఈ చట్టం ఉద్దేశించబడింది. 'లైంగిక వేధింపులు' అన్న పదానికి చట్టంలో నిర్వచనం చాలా స్పష్టంగా ఉంది. 'శారీరక సంబంధం లేదా మరింత పురోగమించడం' నుంచి లైంగికంగా సహకరించాల్సిందిగా చేసే అభ్యర్థన' వరకూ లేదా ఎదుటివారికి తన కోరికను తెలియచెప్పేలా వ్యాఖ్యలు చేయడం కూడా ఈ పరిధి కిందికే వస్తాయి. ఇవన్నీ కూడా నేరాలే. అయితే అత్యాచార నేరమంత తీవ్ర స్థాయి కిందకు రావు. అంతకన్నా ముఖ్యమైనదేమంటే, పౌర పరిష్కారం కనుగొనేందుకు ఉద్దేశించబడిన ఈ చట్టం నిర్దిష్టమైన నిబంధనను కలిగి ఉంది. దీని కింద అన్ని కేసులూ పెట్టదగిన నేరాలు కావు.

2013 చట్టంలోని 27(1) నిబంధన కింద ' బాధిత మహిళ ఇచ్చిన ఫిర్యాదు ఆధారంగా లేదా అంతర్గత కమిటీ నివేదిక ఆధారంగా ఈ చట్టం కింద శిక్షించగలిగిన నేరమని ఏ కోర్టు కూడా గుర్తించదు. క్లాజు 27(3) నిర్దిష్టంగా పేర్కొంటున్నది. ఏమిటంటే, ఈ చట్టం కింద ప్రతినేరం కూడా కేసు పెట్టదగిన నేరం కాబోదు. 'ఈ చట్టంలో ఈరెండూ కూడా అసంబద్ధమైన, అస్పష్టమైన క్లాజులు. ఇటువంటి నేరాలు జరిగినపుడు అంటే తెహల్కా కేసులో జరిగినట్లుగా నేరం జరిగితే దానిని గుర్తించదగిన నేరంగా ప్రభుత్వం తనంతట తానుగా పరిగణనలోకి తీసుకోవాల్సిన బాధ్యతను ఈ క్లాజు రద్దు చేయగలవు. అత్యాచారం వంటి నేరాలను సంబంధిత అత్యాచార వ్యతిరేక చట్టాల కింద విచారించడానికి బదులుగా ఆ నేరాల తీవ్రతను తగ్గించే ఒక సాధనంగా ఈ చట్టం మారుతున్నట్లయితే ఇక న్యాయం కోసం శ్రామిక మహిళలు పోరాటాలు చేయడం హాస్యాస్పదంగా మిగిలిపోగలదు. ఇటువంటి చట్టాల వల్ల బాధితురాలికి న్యాయం జరగకపోగా నిందితుడిని ప్రస్తుత కేసులో అయితే బాస్‌ను కాపాడడానికి పనికివస్తుంది. అయితే ఈ కేసులో నేరాన్ని తక్కువ చేసి చూపించడానికి జరిగిన ప్రయత్నాలన్నింటినీ కూడా అధిగమించి ఎఫ్ఐఆర్ దాఖలు చేయడంతో న్యాయ క్రమం ఆరంభమైంది. దీన్ని తెహెల్కా ఎదుర్కొంటున్న తీరుకు మద్దతుగా మరో వాదన కూడా ముందుకు వస్తోంది. ఇక్కడ ఫిర్యాదీకి తన సొంత నిర్ణయాలు తీసుకునే సామర్థ్యం ఉంది. ఈ నేరాన్ని పోలీసులకు రిపోర్ట్ చేయకూడదని ఆమె అనుకున్నా, న్యాయం కోసం ఇతరత్రా మార్గాలను అన్వేషించాలనుకున్నా లేదా మౌనంగా ఉండాలనుకున్నా కూడా అది ఆమె ఇష్టం. దాన్ని గౌరవించాల్సిందే. లైంగిక వేధింపులకు వ్యతిరేకంగా 2013 చట్టం తక్కువ స్వభావం కలిగిన నేరాల విషయంలో ఎలా వ్యవహరిస్తుందో ఆమెకు తెలుసా? ఈ చట్టం కింద శిక్ష అనేది తనపై జరిగిన నేరంతో ఏవిధంగానూ పొంతన ఉండదని ఆమెకు తెలుసా? చట్ట ప్రకారం తన ఉద్యోగానికి రక్షణ కల్పించబడుతుందని ఆమెకు తెలుసా? న్యాయం కోసం జరిగే పోరాటంలో ఆమెకు అత్యుత్తమమైన న్యాయ సలహాలు, మద్దతు అందుతాయా? ఇటువంటి చట్ట పరిధి ఏమీ లేకుండా, ఆ సంస్థ చేసే వాదనలు నిందితుడిని అత్యాచార వ్యతిరేక చట్టం కింద ప్రాసిక్యూషన్ జరగకుండా కాపాడేందుకు ఒక కవచంగా మాత్రమే ఉపయోగపడతాయి. తెహెల్కా వంటి కేసుల్లో బాధితురాలు పోలీసుల వద్ద కేసు దాఖలు చేసేలా సలహా ఇవ్వడం సంస్థకు, యాజమాన్యానికి తప్పనిసరి. అవసరమైన న్యాయ సహాయాన్ని కూడా అందజేయాలి. వాస్తవానికి, విశాఖ జడ్జిమెంట్ కింద యజమానే ఈ నేరం గురించి పోలీసులకు రిపోర్టు చేయాల్సిన బాధ్యత ఉంది. అయితే అధికారంలో ఉన్న పురుషులు, మహిళా ఉద్యోగుల నిస్సహాయతను అవకాశంగా తీసుకుని వారిని దోపిడీ చేసేందుకు తమ అధికారాన్ని ఉపయోగించుకుంటూ ఉంటారు. వారు నేరం నుంచి తప్పించుకోవడానికి అనుమతించరాదు.

**గుజరాత్ గురించి ఏమిటీ?**

దీనికి రాజకీయపరమైన కోణాలు కూడా ఉన్నాయి. తెహెల్కా స్టింగ్ ఆపరేషన్ వల్లనే బిజెపి అవినీతి గురించి, చీకటి చాటు వ్యవహారాల గురించి ప్రపంచానికి తెలిసింది. ప్రస్తుతం తెహెల్కా కేసు బిజెపికి ఎదురు దెబ్బ కొట్టడానికి ఒక అవకాశం. ఇస్తోంది. వాస్తవానికి పార్టీ అనుసరిస్తున్న ద్వంద ప్రమాణాలను ఈ కేసు ప్రముఖంగా ప్రస్తావిస్తోంది. ఈ కేసులో గోవాలోని బిజెపి ప్రభుత్వం ఈ నేరాన్ని తనంత తానుగా పరిగణనలోకి తీసుకున్నట్లయితే ఇదే ఉత్సాహాన్ని గుజరాత్‌లో ఎందుకు ప్రదర్శించలేదన్నది ఇక్కడ ప్రశ్న. గుజరాత్‌లో ఉన్నది కూడా బిజెపి ప్రభుత్వమేగా, గుజరాత్‌లో చట్టాన్ని అతిక్రమించి, ముఖ్యమంత్రికి తెలిసి ఒక మహిళను తీవ్రవాద నిరోధక బృందం ముమ్మర నిఘాలో ఆయన ఆదేశాల మేరకే ఉంచారా? ఇది కేసు పెట్టదగిన నేరంగా భావించి ఇండియన్ టెలిగ్రాఫ్ చట్టంలోని సెక్షన్ 5.2ను, 354డి (2)ను ఉల్లంఘించినందుకు ప్రభుత్వం ఎఫ్ఐఆర్ దాఖలు చేయాల్సి ఉంది. నేరాలు విభిన్నమైనవే. కానీ రెండూ కేసు పెట్టదగిన నేరాలే, కాబట్టి గోవాలో ఏవైతే వర్తించాయో అదే న్యాయ క్రమాన్ని గుజరాత్‌లో కూడా వర్తింపజేయాల్సి ఉంటుంది. ○

రియల్ స్టోరీ

# సాంప్రదాయ బంధనాల్లో...

- రుక్మిణి గోపాల్

తెల్లవారితే పదవరోజు. మా అక్క ఒంటి మీద నుంచి సౌభాగ్య చిహ్నాలు పూర్తిగా తొలగి పోయే రోజు. కబురు తెలియగానే ఆదరా బాదరా ఏడ్చుకుంటూ వచ్చాను. బావ కొన్ని రోజుల నుంచి అనారోగ్యంగా ఉంటున్నాడు. వైద్యం చేయిస్తున్నారు. అతను ఆ పరిస్థితిలో ఉండగా ఒకసారి వచ్చి చూసి వెళ్లాను. ఇంత ఆకస్మాత్తుగా ఇలా జరుగుతుందనుకోలేదు. రాగానే అక్కయ్యను కౌగిలించుకుని ఏడ్చాను. అది కూడా ఏడ్చింది. కొంత ఉద్ధృతం తగ్గాక వివరాలు అడిగి తెలుసుకున్నాను. తెలుసుకుంటే మాత్రం ఏం ప్రయోజనం! అకస్మాత్తుగా వచ్చినా, ముందు తెలిసే వచ్చినా మృత్యువును ఎవరూ ఆపలేరు కదా! అందరూ దానికి లొంగవలసిందే.

తొమ్మిదవరోజు సాయంత్రమైంది. పునిస్త్రీ అయిన మా మేనత్త వచ్చిన బంధువులలో సువాసినులందరినీ పిలిచి పసుపు కొమ్ము కట్టిన పసుపు తాళ్లను అందరికీ తలోటి ఇచ్చి మెడలో కట్టుకోమంటోంది. అక్క చూడకుండా సంజ్ఞ చేసి నన్ను బయటకు పిలిచింది. నన్ను కూడా ఒకటి కట్టుకోమంది. ఎందుకో నాకర్థం కాలేదు. అదే అడిగాను. మా మేనత్త రహస్యం చెబుతున్నట్లు కొంచెం గొంతు తగ్గించి "మీ బావ పోయిన రోజు మంచిది కాదు. అలాంటి దుష్ట నక్షత్రం రోజున పోతే ఒక తాడుకు పదితాళ్లు తెగుతాయంటారు. రేపు మీ అక్క మెడలో మంగళసూత్రాలు తెంపేస్తారు. రేపు పొద్దుట మనం స్నానం ముందర దోష పరిహారార్థం' మెడలో కట్టుకున్న ఈ తాడును విప్పి అవతల పారెయ్యాలి, లేకపోతే మన మంగళసూత్రాలకు చేటురావచ్చు" అంటూ ఆ తాడును నా చేతిలో పడేసింది. కట్టుకున్నాను. అక్కయ్య చూస్తే బాధపడుతుందేమోనని పమిట మెడనిండా కప్పుకున్నాను. భయమన్నది చాలా చెడ్డది. అది చాలా మందిని లోబరుచుకుటుంది. 'అలా చేస్తే ఇలా జరుగుతుంది. అని ఎవరన్నా అంటే ఒక విధమైన భయం మనలో ఏర్పడి పోనీ అలా చేయ్యకపోతేనేం!' అని మనకనిపిస్తుంది. దాంతో ఆపని చెయ్యము. అందులో మనకు నమ్మకముందా లేదా అన్నది వేరు విషయం. అది ఆలోచించే వివేకాన్ని కూడా పోగొడుతుంది. ఎక్కడో బాగా ధైర్యస్తులుగానీ ఈ భయాన్ని జయించలేరు.

ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. అక్కయ్య ఒక్కతే ఆ గదిలో ఉంది. రోజులాగే నేను వచ్చి తనతో పడుకుంటానని ఆశపడి ఉంటుంది. చాలాసేపు నిరీక్షించి నిరాశపడి ఉంటుంది. దాని మనసు ఎంత బాధపడిందో! లేక ఇంకా పడుతుందో! దానికి మాత్రం నిద్ర ఎలా వస్తుంది? తెల్లవారగట్ల జరగబోయే భీభత్సకాండను తలచుకుని కుమిలి పోతుంటుంది. అక్కయ్యను అలా ఒక్కతెను వదిలేసి నేను మంచిపని చెయ్యలేదేమో! నిజానికి నాకు వీటిమీద నమ్మకముందని చెప్పలేను గాని, ఒకవిధమైన భయం నన్నావహించింది. దానికి లొంగిపోయాను. అది నా విచక్షణ జ్ఞానాన్ని నశింపచేసింది.

ఆలోచనలతో రాత్రంతా నిద్ర పట్టక తెల్లవారు ఝామున కొంచెం కునుకు పట్టినట్టుంది. నాకు మెలకువ వచ్చేసరికి బాగా తెల్లవారిపోయింది. కాఫీ గ్లాసు తీసుకుని, 'అక్కయ్య కాఫీ తాగిందో, లేదో' అనుకుంటూ ఆ గది వైపు బయలు దేరాను. ఎక్కడ నుంచి చూసిందో మా మేనత్త గభాలున వచ్చి నాచేయి పట్టుకుని అవతలకు తీసుకుపోయింది. నేను తెల్లబోయి చూశాను. "రేపు మధ్యాహ్నం భోజనాలయ్యేదాక అక్కను చూడకూడదట, బ్రాహ్మడు చెప్పాడు. అంచేత ఆ ప్రాంతాలకు వెళ్ళకు" అంది కాస్త నెమ్మదిగా. నేను దిగ్భ్రాంతి చెందాను. దానితోపాటు కోపం కూడా వచ్చేసింది.

ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. అక్కయ్య ఒక్కతే ఆ గదిలో ఉంది. రోజులాగే నేను వచ్చి తనతో పడుకుంటానని ఆశపడి ఉంటుంది. చాలాసేపు నిరీక్షించి నిరాశపడి ఉంటుంది. దాని మనసు ఎంత బాధపడిందో! లేక ఇంకా పడుతుందో! దానికి మాత్రం నిద్ర ఎలా వస్తుంది? తెల్లవారగట్ల జరగబోయే భీభత్సకాండను తలచుకుని కుమిలి పోతుంటుంది. అక్కయ్యను అలా ఒక్కతెను వదిలేసి నేను మంచిపని చెయ్యలేదేమో! నిజానికి నాకు వీటిమీద నమ్మకముందని చెప్పలేను గాని, ఒకవిధమైన భయం నన్నావహించింది. దానికి లొంగిపోయాను. అది నా విచక్షణ జ్ఞానాన్ని నశింపచేసింది.

"మీకేమన్నా మతిపోయిందా? ఈ పరిస్థితిలో రేపు మధ్యాహ్నం దాకా అక్కయ్య అక్కడ ఒక్కతే ఎలా ఉండగలదనుకున్నారు.? గుండె పగిలి చస్తుందేమో!" అన్నాను కోపం, బాధ మిళితమైన స్వరంతో. మా మేనత్త కళ్లమ్మట నీళ్లు వచ్చాయి."ఎవరేం చేయగలం? దాని కర్మ అలా ఉంది.అందుచేతనే అతడు దుష్టనక్షత్రంలో చనిపోయాడు. ఈ నియమాలు ఇప్పుడు మనం పెట్టినవి కాదుగదా! ఎప్పటి నుంచో వస్తున్న ఆచారాలు. ఈ లోపుగా చూస్తే దోషమని బ్రాహ్మడు చెపుతుంటే ఆవేపు వెళ్లేందుకు ఎవరు సాహసిస్తారే?" అంది. అత్తయ్య చెప్పిన దాంతో నేను సమాధాన పడలేకపోయాను "మీ అందరికి భయమైతే అక్కయ్య దగ్గర నేనుంటాను. అక్కయ్యను ఒంటరిగా వదిలెయ్యలేను'' అని ఓ అడుగుముందుకు వేయబోయాను. అకస్మాత్తుగా నాకో ఆలోచన వచ్చింది. "అత్తయ్యా రాణీ వదిన, ఏలూరు దొడ్డమ్మ పుని స్త్రీలు కాదుగదా, అలాంటి వాళ్లలో ఎవరైనా ఒకరు అక్కయ్యకు తోడుగా ఉండవచ్చుకదా?'' అన్నాను కొంచం ఆశతో. అలాంటివాళ్లు కూడా ఇలాంటప్పుడు దగ్గరుండరే అందులో పిల్లలున్నవాళ్లు అసలు ఉండరు, వాళ్లకు అరిష్టంట! నామాట విను. ఇంక ఈ విషయం గురించి ఆలోచించకు" అని ఎవరో ఏదో పనిమీద పిలిస్తే అత్తయ్య వెళ్లిపోయింది. నేలకు అంటుకుపోయినట్లు నేనక్కడే నిలబడిపోయాను.

ఒంటరిగా ఉన్నా నలుగురిలో ఉన్నా అక్కయ్య ఆలోచనలు నన్ను వదలలేదు. భోజనాల సమయమయింది. అందరూ భోజనాల గది వేపు బయలుదేరారు. నాకు చటుక్కున ఆలోచన వచ్చింది. అత్తయ్యను వెదుక్కుంటూ వెళ్లాను. " అత్తయ్యా, మరి అక్కయ్య భోజనం ఎలా?" అనడిగాను "అక్కయ్యను పస్తుపడుకోపెడతామటే? ఏ ఏలూరు దొడ్డమ్మలాంటివాళ్లో అన్నీ వడ్డించి విస్తరిని పట్టుకెళ్లి గది గుమ్మానికవతల నిలబడి లోపల పెడతారులే" అంది. నిన్న రాత్రి అన్ని విషయాలు దానికి చెప్పాను. ఈ వెళ్లిన వాళ్లు బుర్రవంచుకుని ఆ ఆకునక్కడ పెట్టేసి వచ్చేస్తారు" అంది అదేదో చాలా సామాన్యమైన విషయమన్నట్లు. అక్కయ్య పరిస్థితి నన్ను కలచివేసింది. ఆ పూట నాకు అన్నం సహించలేదు. అక్కయ్య సరిగ్గా తిందో, లేదో అసలు విస్తరి ముట్టుకోలేదేమో! రోజూ తను దగ్గరుండి బతిమాలి, నువ్వు తినకపోతే నేను కూడా తిననని బెదిరిస్తే కాస్త ఎంగిలిపడేది. విస్తట్లో ఉన్నవన్నీ ఇంచుమించు అలాగే ఉండిపోయేవి. అలాంటిది ఇవాళ తింటుందా? ఆ రాత్రి మళ్లీ నాకు నిద్రపట్టలేదు.

మర్నాడు తెల్లారింది. మధ్యాహ్న భోజనాలయాయి. ఇక కార్యక్రమం ప్రారంభమయింది. ఒక్కొక్కరే నెమ్మదిగా అక్కయ్య గదిలోకి వెళ్లటం మొదలు పెట్టారు. ఎలాంటి దృశ్యాన్ని చూడవలసి వస్తుందో అని భయపడుతూ గదిలో అడుగుపెట్టాను. ఓ పక్కగా గోడకు ఆనుకుని తెల్లచీరలో అక్కయ్య కూర్చుని ఉంది. ఏదో అపరాధం చేసినదానిలా బుర్ర వంచుకుని కూర్చుంది. నా కెంతో బాధనిపిస్తుంది. నాకే ఇలా ఉంటే ఇక అక్కయ్య మనస్సు ఎంత క్షోభిస్తుందో అర్థం చేసుకోగలను. అందరు వచ్చి వెళ్లిపోయేదాకా ఆగి ఆ తరువాత అక్కను కౌగిలించుకుని బావురుమన్నాను. ఇద్దరి కన్నీళ్లు మమ్మల్నిద్దరిని తడిపేశాయి.

లాంఛన ప్రకారం వచ్చిన వాళ్లందరు 12వ రోజు వెళ్లిపోవాలి. కాని నేను వెళ్లలేదు. అక్కయ్యను చూడటానికి వచ్చిన మావారికి అక్కయ్య దగ్గర ఇంకొన్ని రోజులు ఉంటానని చెప్పాను ఆయన వెళ్లిపోయారు. నేను అక్కయ్యను వదలకుండా అక్కయ్యతోటే ఉంటున్నాను. నాలో కొన్ని ఆలోచనలు ప్రవేశించి ఎంతవద్దనుకున్నా వదలటంలేదు. 'ఒంటరిగా వదిలివేయబడ్డ అక్కయ్య ఆ రోజులు ఎలా గడిపింది? అప్పుడు దాని మానసిక పరిస్థితి ఎలా ఉంది? ఇవి తెలుసుకోవాలన్న కుతూహలం నాకు కలిగింది. నాలుగైదు రోజులయి అక్కయ్య కొంచెం స్థిమిత పడ్డాక నెమ్మదిగా ఆ విషయం అడిగాను. అవి జ్ఞాపకం వచ్చి అనుకుంటాను అక్కయ్య ముఖం మారిపోయింది. "నరకాన్నే అనుభవించాననుకో శ్యామలా, మనసు బాగున్నా, బాగా లేకపోయినా కాలకృత్యాలు తప్పవుగా! మన పనిమనిషి ముసలి కావమ్మను నాకు కాపలాగా పెట్టారు. ఆ గదిలోంచి పెరట్లోకి వెళ్లేందుకు ఓగుమ్మం

"నరకాన్నే అనుభవించాననుకో శ్యామలా, మనసు బాగున్నా, బాగా లేకపోయినా కాలకృత్యాలు తప్పవుగా! మన పనిమనిషి ముసలి కావమ్మను నాకు కాపలాగా పెట్టారు. ఆ గదిలోంచి పెరట్లోకి వెళ్లేందుకు ఓగుమ్మం ఉందిగా. బైటకు వెళ్లవలసిన అవసరం వచ్చినప్పుడు ఆ తలుపులు కొద్దిగా తెరిచి కావమ్మకు చెప్పేదానిని. అది ఇంట్లో వాళ్లందరికి ఆ విషయం చెప్పి పెరట్లో ఎవ్వరిని రావొద్దనేది. అది ఆ పని చేసి వచ్చి నాకు చెప్పితే అప్పుడు నేను బైటకు వెళ్లి వచ్చేదానిని. నేను బైటకు వెళ్లేటప్పుడు నా మొహం కనపడకుండా అది వెనక్కు తిరిగి నిలబడేది. నాకెంత బాధవేసేదో! ఆ మూడుపూటలు తిన్న విస్తరి బైట పారేసేందుకు కూడా నేను వెళ్లలేదు. ఎందుకంటే పొరపాటున ఎవరికంటనన్నా పడ్డాననుకో నన్ను చచ్చేటంత తిట్టుకుంటారు. విస్తరిలో అన్ని పదార్థాలు మిగిలి పోవటంతో చీమలు పట్టాయి. ఆ చీమలు నన్ను కుట్టి బాధించాయి. ఇలాంటి శిక్ష పగవాళ్లకు కూడా రాకూడదు శ్యామలా"

"అలాటి పిచ్చులు మీలాంటోళ్లకు గాని మాకు లేవమ్మా. ఈ చేతులతో ఇలాంటి పనులు ఎన్నిసేసానో! నా బొట్టు, సూత్రాలకు ఏ లోటురాలేదు. మా ఆయన నిక్షేపంగా ఉన్నాడు. తాడుకోసేసి తీసుకున్న ఆ సూత్రాలను కరిగించి, ఆ బంగారంతో నాకో, నా ఆడపిల్లలకో ఏదో ఒకటి సేయించుకుంటాను. నేనొక్కదాన్నే కాదమ్మా, మాజాతి అందరూ ఈ పనిసేస్తారు. నాకు ముందు మా అత్తమ్మసేసేది. మామావ అదే ఆమె మగడు తొంబై ఏండ్లు బతికిండు. ఎవరి ఆయుర్ధాయాన్ని ఎవరూ తీసేయలేరమ్మా. ఇదంత మీ చాదస్తాలు" అంటూ బట్టలు లెక్కపెట్టటం మొదలెట్టింది.

ఉందిగా. బైటకు వెళ్లవలసిన అవసరం వచ్చినప్పుడు అ తలుపులు కొద్దిగా తెరిచి కావమ్మకు చెప్పేదానిని. అది ఇంట్లో వాళ్లందరికి ఆ విషయం చెప్పి పెరట్లో ఎవ్వరిని రావొద్దనేది. అది ఆ పని చేసి వచ్చి నాకు చెప్పితే అప్పుడు నేను బైటకు వెళ్లి వచ్చేదానిని. నేను బైటకు వెళ్లేటప్పుడు నా మొహం కనపడకుండా అది వెనక్కు తిరిగి నిలబడేది. నాకెంత బాధవేసేదో! అ మూడుపూటలు తిన్న విన్తరి బైట పారేసేందుకు కూడా నేను వెళ్లలేదు. ఎందుకంటే పొరపాటున ఎవరికంటనన్నా పడ్డాననుకో నన్ను చచ్చేటంత తిట్టుకుంటారు. విస్తరిలో అన్ని పదార్థాలు మిగిలి పోవటంతో చీమలు పట్టాయి. ఆ చీమలు నన్ను కుట్టి బాధించాయి. ఇలాంటి శిక్ష పగవాళ్లకు కూడా రాకూడదు శ్యామలా" ఈ విషయాలు చెబుతున్నపుడు అది ఆ రెండు రోజుల్లో పడ్డ బాధ అక్కయ్య ముఖంలో నాకు గోచరించింది. అప్పటి అక్కయ్య పరిస్థితి తెలుసుకుని నేను చాలా బాధపడ్డాను.

ఆరోజు మాసినబట్టలు తీసుకెళ్లేందుకు చాకలి మంగి వచ్చింది. రెండు వారాలకోసారి చాకలికి బట్టలు వెయ్యటం అనే పూర్వపు పద్ధతి మా ఇంట్లో ఇంకా కొనసాగుతోంది. నలుపు రంగే అయినా మంగి మొహం కళగా ఉంటుంది. నుదుటి మీద పెట్టుకునే రూపాయి కాసంత ఎర్రటి కుంకుమబొట్టు కొట్టొచ్చినట్లు కనబడుతుంది. మెడలో లావుపాటి పసుపు తాడు, దానికి వేళాడుతున్న మంగళసూత్రాలు, తను కట్టుకున్న లేత రంగు వాయిల్ చీరలోంచి మసకగా కనపడుతున్నాయి. కాళ్లకు లావుపాటి వెండి కడియాలు ఉన్నాయి. దాన్ని చూడగానే నాకు ఆనాటి సంఘటన గుర్తుకు వచ్చింది. ఆరోజు ఏం జరిగింది? ఎలా జరిగింది? అక్కయ్య ఎలా ఫీలయింది? ఇవన్ని తెలుసుకోవాలని నాకు అనిపిస్తోంది. కానీ ఇంకా అక్కయ్యనడిగి దాని మనసును బాధపెట్టటానికి నాకు మనస్కరించలేదు. ఇంకోళ్లను అడిగేందుకు అక్కడ ఇంకెవరూ ఉండరు. అందుచేత మంగినే అడగాలనుకున్నాను. అప్పుడు అక్కయ్య అక్కడ లేదు. స్నానానికి వెళ్లింది. ఇదే సమయమని మంగినడిగాను. "మంగీ పదవరోజు అక్కడ ఎంత ఘోరంగా జరుగుతుందో, దానికి ఆ మనిషి ఎంత బాధ పడుతుందో అని తెలుసుకోవాలనిఉంది. వీలైతే అలాంటివి జరగకుండా ఆపాలని నా ఉద్దేశం. చెప్పు మంగీ, తొందరగా చెప్పు" అన్నాను కొంచెం ప్రాధేయపడుతూ. మంగి కొంచె మెత్తబడింది. "ఏం చెప్పమంటారమ్మా? ఘోరం! ముందు బొట్టు చెరిపేస్తాను. చేతులు రెండు ఒకదానితో ఒకటి గట్టిగా కొట్టి గాజులు పగల కొట్టేస్తాను. ఇంటి నుంచి చాకో, బ్లేడో కూడా తెచ్చుకుంటాను. దానితో మంగళసూత్రాల తాడు కోసేసి ఆసూత్రాలు బొడ్డులో దోపుకుంటాను ఇదివరకు మంగలికి కూడా పనిపడేది. ఇప్పుడు చాలా మంది అది మానుకున్నారు. కట్టుకున్న చీర విడిపించేసి తెల్లచీర కట్టిస్తాను. ఆ ఇడిసిన చీరను నాను పట్టుకుపోతాను. ఈ పనులు సేస్తుంటే నా మనసు భాధపడతాదమ్మా. కానీ ఏటీ సెయ్యటం? ఇంటి చాకలినైనందుకు నాకివి తప్పవు" అంది కొంచెం విచారంగా. నాకో సందేహం వచ్చింది. "మంగీ, మరి నువ్వు కూడా పునిస్త్రీ దానివే కదా, మరి అక్కయ్యను చూడటానికి, ఈ పనులు చెయ్యటానికి నీకు భయం వెయ్యలేదా?" అని అడిగాను. మంగి మళ్లీ మామూలు మంగి అయింది. "అలాటి పిచ్చులు మీలాంటోళ్లకు గాని మాకు లేవమ్మా. ఈ చేతులతో ఇలాంటి పనులు ఎన్నిసేసానో! నా బొట్టు, సూత్రాలకు ఏ లోటురాలేదు. మా ఆయన నిక్షేపంగా ఉన్నాడు. తాడుకోసేసి తీసుకున్న ఆ సూత్రాలను కరిగించి, ఆ బంగారంతో నాకో, నా ఆడపిల్లలకో ఏదో ఒకటి సేయించుకుంటాను. నేనొక్కదాన్నే కాదమ్మా, మాజాతి అందరూ ఈ పనిసేస్తారు. నాకు ముందు మా అత్తమ్మసేసేది. మామావ అదే ఆమె మగడు తొంబై ఏండ్లు బతికిండు. ఎవరి ఆయుర్ధాయాన్ని ఎవరూ తీసేయలేరమ్మా. ఇదంత మీ చాదస్తాలు" అంటూ బట్టలు లెక్కపెట్టటం మొదలెట్టింది. ఇంతలో అక్కయ్య వచ్చేసింది. ఇంకనేనా ప్రస్తావన ఎత్తలేదు. కానీ మనసులో ఆలోచనలు పోలేదు. బ్రాహ్మణుడు నిర్ణయించిన టైము కంటె ముందుగా ఆ మొహం చూస్తే తమ పసుపు కుంకాలు రాలిపోతాయని భయపడే రకం ఒకరు, నిర్భయంగా వెళ్లి చెయ్యవలసిన పనులు చేసి ఆ కట్టి విడిచిన చీర, బంగారం పట్టుకుపోయి ఉపయోగించుకునే రకం ఒకరు. వాళ్లకు కలగని దోషం మనకెందుకు కలుగుతుంది.? ఆ శ్రమజీవికి వున్న వివేకం చదువుకున్న వాళ్లమని విర్రవీగే మనకెందుకు లేదు? స్త్రీని నిర్జీవం చేసే ఈ మూఢాచారాల బంధనాలను ప్రతి ఒక్కరం ప్రతిఘటించాల్సిందే. అప్పుడే మార్పు సాధ్యం.

★

# అంతర్జాతీయ మహిళా దినోత్సవం

-కె. స్వరూపరాణి

మార్చి-8 అంతర్జాతీయ మహిళా దినోత్సవం ప్రపంచ వ్యాప్తంగా హక్కుల కోసం గళమెత్తే మహిళలందరికీ స్ఫూర్తి నిచ్చే రోజు. మహిళా దినోత్సవం ఏర్పడి 104 ఏళ్ళు గడిచినా మహిళలపై అణచివేత, దోపిడీ పీడన పోలేదు. మహిళా సాధికారిత ఇంకా ఆమడ దూరంలో ఉంది. గత మూడు దశాబ్దాలుగా పాలకులు అనుసరిస్తున్న సరళీకరణ విధానాల వల్ల మహిళల బతుకులు మరింత దిగజారుతున్నాయి.

**నేపథ్యం:** 1857 మార్చి 8న అమెరికాలోని న్యూయార్క్ నగరంలో వేతనాలు పెంచాలని, 18 గం॥పనిని తగ్గించాలని, పని ప్రదేశాలలో మెరుగైన సౌకర్యాలు కల్పించాలని, ఓటుహక్కు, వేధింపులకు వ్యతిరేకంగా బట్టల మిల్లులో పనిచేసే మహిళా కార్మికులు భారీ ప్రదర్శన నిర్వహించారు. యాజమాన్యం, సమ్మె చేస్తున్న మహిళా కార్మికులను నిర్బంధించి కాల్పులు జరిపింది. కాల్పుల్లో దాదాపు 146 మంది మహిళా కార్మికులు నేలకొరిగారు. "ఆకలితో చస్తూ బ్రతికే కన్నా పోరాడుతూ చావడం మేలు" అన్న నినాదంతో సమ్మెను కొనసాగించటంతో యాజమాన్యం తల ఒగ్గక తప్పలేదు. ఈ పోరాటం ప్రపంచ కార్మికులను సంఘటిత పరిచింది. న్యూయార్క్ మహిళల స్ఫూర్తితో క్లారాజెట్కిన్ నాయకత్వాన 1907 స్టట్‌గార్ట్‌లో మొట్టమొదటి ఇంటర్నేషనల్ సోషలిస్టు వుమెన్స్ కాన్ఫరెన్స్ జరిగింది. ఆ తర్వాత 1910 కోఫెన్ హెగెన్‌లో జరిగిన 2వ అంతర్జాతీయ మహిళా సదస్సు ప్రతి సంవత్సరం మార్చి-8 మహిళలని హక్కుల దినంగా జరపాలని ప్రపంచ మహిళలకు పిలుపునిచ్చింది. ఆనాటి నుండి సమానత్వం కొరకు, దోపిడీ, పీడనకు వ్యతిరేకంగా మార్చి 8 మహిళా దినోత్సవం జరుపుకుంటున్నాం. ప్రపంచవ్యాప్తంగా అన్ని దేశాలూ మహిళల సమస్యలను చర్చించటానికి అంతర్జాతీయ మహిళా సదస్సు జరపాలని ఐక్యరాజ్యసమితి నిర్ణయించింది.

**అంతర్జాతీయ సదస్సులు:** 1975 మెక్సికోలో మొదటి అంతర్జాతీయ మహిళా సదస్సు జరిగింది. ఆ సదస్సులో (1975-85) దశాబ్ద కాలంపాటు మహిళా దినోత్సవాలు ప్రత్యేకంగా నిర్వహించాలని సదస్సు పిలుపు నిచ్చింది. ఆ సదస్సులో పాల్గొన్న భారత ప్రభుత్వం మహిళా సాధికారిత కోసం అన్ని రకాల వివక్షతలను, అసమానతలను తొలగిస్తామని ప్రకటించింది. 1975 నుండి మన దేశంలో మహిళా దినోత్సవాలు జరుగుతున్నాయి.

3వ ప్రపంచ మహిళా సదస్సు 1985లో నైజీరియాలో జరిగింది. దశాబ్ద కాలంగా ఆయా దేశాల విజయాలను సమీక్షించి ఫలితాలు సంపూర్ణంగా లేవని, పునస్సమీక్షించాలని పిలుపు నిచ్చింది. మరల 1995లో బీజింగ్‌లో నాల్గవ ప్రపంచ మహిళా సదస్సు జరిగింది. 195 దేశాల నుంచి హాజరైన సదస్సులో మహిళా సంఘాలు పెట్టిన అనేక తీర్మానాలు ఆమోదింపబడ్డాయి. ఈ నేపథ్యంలో అనివార్యంగా మహిళా సమస్యలు పరిష్కరించటానికి కృషి చేయాల్సిన అవసరం ఏర్పడింది. 2015 నాటికి జండర్ సమానత్వాన్ని, మహిళల సాధికారితను సాధించడం, హింసను నిరోధించడం, పేదరికం, ఆకలిని నిర్మూలించడం ,ప్రాథమిక విద్యను అందించటం వంటి సహస్రాబ్ది లక్ష్యాలను సాధించేందుకు అవసరమైన చర్యలు చేపట్టాలన్న ఐక్యరాజ్యసమితి ప్రకటనపై భారత ప్రభుత్వం సంతకం చేసింది.

**ప్రస్తుత శ్రామిక మహిళల పరిస్థితులు:** 2014లోకి అడుగు పెట్టాం. మహిళా సాధికారిత కాగితాలకే పరిమితమైంది. గత మూడుదశాబ్దాలుగా ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలన్నింటా అసమానతలు కొనసాగుతున్నాయి. ఎన్నో పోరాటాల ఫలితంగా సాధించుకున్న చట్టాలు కూడా కనుమరుగవుతున్నాయి. శ్రామిక మహిళలపై సరళీకరణ విధానాల ప్రభావం మరింతగా వుంది. మహిళాభివృద్ధికి ఆర్థిక స్వాతంత్ర్యం తప్పనిసరి అని చెబుతూ దానికి కావలసిన ఉద్యోగ ఉపాధి సౌకర్యాలు మెరుగుపరచకపోతే మహిళలు ఎలా అభివృద్ధి సాధిస్తారు? సంఘటిత రంగంలో 6శాతం మాత్రమే మహిళలు వున్నారు. వ్యవసాయం, బీడీ,భవన నిర్మాణ రంగంలో లక్షలాది మంది మహిళలు పనిచేస్తున్నారు. నేషనల్ శాంపిల్ సర్వే ఉపాధి స్థాయిని బట్టి కార్మికులను మూడు కేటగిరీలుగా విభజించింది 1.రెగ్యులర్ పని 2 క్యాజువల్ పని 3 స్వయం ఉపాధి. రెగ్యులర్ కార్మికులు ఈకాలంలో 9శాతం నుండి 10.1శాతానికి మాత్రమే పెరిగారు.



క్యాజువల్ కార్మికుల సంఖ్య 30శాతం నుండి 36 శాతానికి పెరిగింది. స్వయం ఉపాధిలో పురుషుల కన్నా స్త్రీలు అధికంగా వున్నారు. ఈ రంగంలో కూడా మహిళల ఉపాధి 2004-2005 కి 2009-10కి మధ్య 61శాతం నుండి 50శాతానికి పడిపోయింది. ఉపాధి రహిత అభివృద్ధికి దారితీసే ప్రభుత్వ విధానాల వల్ల స్వయం ఉపాధి పొందుతున్న మహిళలు క్యాజువల్ కార్మికులుగా మారుతున్నారు.

సరళీకరణ విధానాల వలన మహిళలకు ఉద్యోగ అవకాశాలు పెరిగాయనే వాదన జరుగుతోంది. ఐటి, సేవారంగం, కమ్యూనికేషన్స్ వంటి రంగాలలో కొద్దిమేర ఉపాధి అవకాశాలు పెరిగినమాట వాస్తవమే. కానీ వారి సంఖ్య సాపేక్షంగా చూస్తే చాలా తక్కువ.సంఘటిత రంగంలో ఉద్యోగాలు కల్పించే ప్రభుత్వం, ప్రభుత్వ రంగ సంస్థల్లో పెట్టుబడుల ఉపసంహరణ మరియు కాంట్రాక్టు, క్యాజువల్, ఓట్‌సోర్సింగ్ ద్వారా నియామకాలు జరపటం వల్ల కూడా అసంఘటిత రంగాన్ని పెంచుతోంది. వివిధ ప్రభుత్వ పథకాల్లో సుమారు 60లక్షల మంది మహిళలను నియమించారు. ఐసిడిఎస్, ఎన్.ఎచ్.ఆర్.యం ,మధ్యాహ్న భోజన పథకం ,ఆశా మొదలైన పథకాలలో పనిచేసే మహిళలను ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తింపులేదు. గౌరవ వేతనం పేరుతో వారి శ్రమను దోపిడీ చేస్తోంది.

**ఇంటి పని చేసే మహిళా కార్మికులు:.** పట్టణ ప్రాంతాల్లో సర్వీసు సెక్టార్లల్లో పనిచేస్తున్న ఇంటిపని చేసే మహిళల సంఖ్య గణనీయంగా పెరిగింది. ఇంటి పనికి పెట్టుకునే మధ్య తరగతి మహిళలు కూడా పెరిగారని దీనివల్ల అర్ధమవుతుంది. దేశంలో 20నుండి60లక్షల మంది ఇంటి పనివారున్నారని లెక్కలు తెలుపుతున్నాయి. ఇంత పెద్ద సంఖ్యలో ఉన్న ఇంటిపని కార్మికులకు లభించే హక్కులన్నీ వీరికి లభించాలని ఐఎల్ఓ చేసిన ఒప్పంద పత్రంపై భారత ప్రభుత్వం సంతకం చేయలేదు. మహిళా ఉద్యమాల ద్వారా ఇంటి పనివారలని కార్మికులుగా గుర్తిస్తూ రాష్ట్ర ప్రభుత్వం జీవో తెచ్చింది. ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా శ్రామిక మహిళలు తమ హక్కుల కోసం ఉద్యమిస్తున్నారు.

**ఆర్థిక అసమానతలు:** గడిచిన సంవత్సరానికి ఇప్పటకీ వృద్ధిరేటు పెరుగుదల లేదు. రూపాయి పతనం వలన నిత్యావసర ధరలు ఎగిసిపడుతున్నాయి. పేదలకిచ్చే సబ్సిడీలకు కోత పెడుతున్నారు. మరోప్రక్క బడా పారిశ్రామిక వేత్తలకు ప్రతి సంవత్సరం 5లక్షల కోట్ల రూపాయలుపైన రాయితీలు ఇస్తుంది. చమురు ధరలపై నియంత్రణ ఎత్తివేసిన తర్వాత 120శాతం ధరలు పెరిగాయి. సబ్సిడీ గ్యాస్ సిలండర్‌కి నగదు బదిలీ పథకం వర్తింపచేయటం వలన మహిళలకు అదనపు కష్టాలను తెచ్చిపెట్టింది. రూపాయి విలువ రోజురోజుకు పతన దిశగా పడిపోతుండడం వలన గ్యాస్ ధర మరింత పెరిగే అవకాశాలు ఉన్నాయి. ఆహార పదార్ధాలు, మందుల ధరలు పెరగడంతో పౌష్టికాహార లోపంతో పేదలు అనారోగ్యానికి గురవుతున్నారు. ప్రభుత్వం ఆదాయం కోసం మద్యం విచ్చలవిడి అమ్మకాలు పెంచింది. మరోప్రక్క అవినీతి రాజ్యమేలుతోంది. దేశంలో ధనికులు పెరిగారు. గత ఏడాది 48గా వున్న శతకోటీశ్వర్ల సంఖ్య ఈ ఏడాదికి 55 మంది(5వేలకోట్ల ఆస్తిపైన) కి పెరిగారు. ప్రపంచ దేశాలలో 186 దేశాలకు గాను మానవాభివృద్ధిలో 136 స్థానంలో భారత దేశం వుందని యు.ఎన్.ఐ రిపోర్టులు వెల్లడిస్తున్నాయి.

**మహిళలు,బాలికలపై పెరుగుతున్న హింస:** ప్రస్తుతం మహిళలు ఆర్థిక అసమానతలతోపాటు అతిపెద్ద సమస్య వారిపై జరుగుతున్న హింస. కుల మత వర్గ బేధాలు లేకుండా అన్ని తరగతులకు చెందిన మహిళలపై లైంగికదాడులు, అత్యాచారాలు, గృహహింస, యాసిడ్ దాడులు, ఆడపిల్లల అక్రమ రవాణా, వరకట్న వేధింపులు మొదలగు హింసలకు గురవుతున్నారు. దళిత, గిరిజన వెనకబడిన తరగతుల మహిళల పరిస్థితి మరీ అధ్వాన్నంగా మారింది. ప్రపంచీకరణ స్త్రీని వినియోగ వస్తువుగా మార్చింది. బహుళ జాతి కంపెనీల మాయాజాలంలో స్త్రీ పురుషులు బలవుతున్నారు. వినియోగదారీతత్వం పెరిగింది. ఈ దశలో విలువలు క్షీణిస్తున్నాయి. క్షీణ సంస్కృతి మానవతా విలువలను మంట గలుపుతోంది. ఇంటర్నెట్, ఫేస్‌బుక్, ట్విట్టర్, సెల్‌ఫోన్,

**తరువాయి 33వ పేజీలో**

పరిశీలన

# ఆస్టియోపోరోసిస్ వ్యాధి -నివారణ

డా॥కె. భారతీ సాగర్


Normal


Osteoporotic bone

ఆస్టియోపోరోసిస్ అనేది ఎముకలకు సంబంధించిన వ్యాధి. ఈ వ్యాధిలో ఎముకలలోని గట్టిదనం కోల్పోవటం వలన ఎముకలు పెళుసుబారుతాయి. ప్రస్తుత కాలంలో బి.పి., చక్కెర వ్యాధి శాతం ఏవిధంగా పెరుగుతుందో ఈ వ్యాధి కూడా ప్రపంచ వ్యాప్తంగా ఎక్కువ మందికి వస్తోంది . ఈ వ్యాధి స్త్రీ, పురుషులు ఇద్దరికీ వస్తుంది. కానీ పురుషుల కన్నా స్త్రీలలో, అది కూడా మెనోపాజ్‌కి దగ్గరవుతున్న స్త్రీలలో ఈ వ్యాధి వచ్చే అవకాశం మూడు రెట్లు ఎక్కువ. యుక్త వయస్సులో ఎముకల కణజాలంలో నిరంతరం పాత కణజాలం నశించిపోతూ వాటి స్థానంలో కొత్త కణజాలం ఏర్పడుతుంది. కానీ వృద్ధాప్యంలో ఈ ప్రక్రియ మందగిస్తుంది. ప్రత్యేకంగా స్త్రీలలో ముట్లుడిగిపోయే దశలో హార్మోన్లస్రావం అత్యల్పంగా ఉండటం వలన ఎముకలలో సాంద్రత తగ్గిపోతుంది. స్త్రీలలో ఈస్ట్రోజన్ హార్మోన్ ఎముకలు గట్టిగా ఉండటానికి, వాటి సాంద్రతని కాపాడటానికి తోడ్పడుతుంది. మెనోపాజ్ దశకి కొద్దిగా ముందు నుంచి ఈస్ట్రోజన్ హార్మోన్ స్రావం తగ్గుతూ రావటం వలన, ఎముకలు పెళుసుబారటం మొదలవుతుంది. ఈ కారణంగా మొదట్లో నడుమునొప్పి, అకస్మాత్తుగా శరీరం ఎత్తు తగ్గటం, వంగిపోవటం మొదలగునవి ఉంటాయి. చాలా మందిలో ఇటువంటి లక్షణాలు ఉండకపోవచ్చు. కానీ వ్యాధి తీవ్రమయ్యేకొద్దీ తుంటి ఎముక, వెన్నెముక, మోచేతి ఎముక మొదలగునవి ఫ్రాక్చర్ కావడం(విరగటం) జరుగుతుంది.

ఆధునిక కాలంలో పెరిగిన వైద్య ప్రమాణాల వలన స్త్రీలలో ఆయుఃప్రమాణం పెరుగుతుంది. తద్వారా తన జీవితంలో మూడోవంతు భాగం స్త్రీ మెనోపాజ్ దశలో గడపవలసి వస్తోంది. అయితే మెనోపాజ్ ముందు వరకు స్త్రీలలో గుండెకి, ఎముకలకి అండగా ఉండే ఈస్ట్రోజన్ హార్మోన్ స్రావాలు తగ్గిపోవటంతో గుండెజబ్బులు, ఎముకలలో పెళుసుదనం, మోకాళ్ళ నొప్పులు, కండరాల నొప్పులు, మెదడులో రక్తం గడ్డకట్టడం, మానసిక ఆందోళనలు, భయాందోళనలు మొదలగునవి సంభవిస్తాయి. వీటన్నింటి నుంచి తప్పించుకోవటానికి మనం నిత్యజీవితంలో పాటించవలసిన వాటి గురించి ఈ ఆర్టికల్‌లో తెలుసుకోబోతున్నాం.

ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా 1.3 నుంచి 1.7 మిలియన్ల మందిలో తుంటి ఎముక ఫ్రాక్చర్స్ జరుగుతున్నాయి. ఈ సంఖ్య 2025 సంవత్సరానికి మూడు మిలియన్లకి పెరుగుతుందని ఒక అంచనా. అంతేకాదు, 60 సంవత్సరాలకు పైబడిన వారిలో తుంటి ఎముక ఫ్రాక్చర్ అయితే వారిలో దాదాపు 25శాతం మంది స్త్రీలు మరణిస్తున్నారు.

స్త్రీలలో మెనోపాజ్ దశలో ఈస్ట్రోజన్ హార్మోన్ స్రావాలు తక్కువ కావటం ఆస్టియో పోరోసిస్ వ్యాధికి ముఖ్య కారణంగా తెలుసుకున్నాం. అయితే మెనోపాజ్ దశలోనే కాకుండా ఇంకా కొన్ని పరిస్థితులలో ఈస్ట్రోజన్ హార్మోన్ల స్రావం తగ్గిపోతుంది.

**అనోరెక్సిసా నెర్వోసా వ్యాధి:** అధిక శారీరక వ్యాయామం వలన నెలసరి ఋతుస్రావం ఆగిపోవటం, గొనడట్రోఫిన్ హార్మోన్ స్రావాలను ఆపివేసే మందులు తీసుకోవటం. ఈ పరిస్థితుల్లో కూడా ఈస్ట్రోజన్ హార్మోన్ల స్రావాలు తగ్గిపోవటం ద్వారా ఎముక కణజాలం క్షీణత మొదలవుతుంది.

సాధారణంగా ఆస్టియోపోరోసిస్ వ్యాధి తొలిదశలో పెద్దగా ఎటువంటి లక్షణాలు కనపడవు. ఫ్రాక్చర్ అయ్యేవరకు వ్యాధి ఉన్నది కూడా తెలియదు. వ్యాధిని తొలిదశలోనే నిర్ధారణ చేయటానికి స్త్రీలలో యాభై సంవత్సరాల వయసు పైబడినప్పటి నుంచి బి.యం.డి. పరీక్ష ద్వారా ఎముకల్లోని సాంద్రతను పరీక్ష చేయిస్తూ ఉండాలి. అయితే ఈ పరీక్ష కాస్త ఖరీదైన వ్యవహారం.

**వ్యాధి నివారణ:**

1. శారీరకంగా చురుకైన జీవనశైలి కలిగి ఉండటం.
2. ప్రతిరోజు ఉదయం లేదా సాయంత్రం లేత ఎండలో కొద్దిసేపు గడపటము.
3. పొగ త్రాగటానికి, మద్యపానానికి దూరంగా ఉండటము.
4. ఆహారంలో తగినంత పరిమాణంలో

కాల్షియం ఉండేలా చూసుకోవాలి.

5. అధిక బరువు లేకుండా చూసుకోవాలి. ఎత్తుకి తగినంత శరీర బరువు ఉండేలా చూసుకోవాలి.

పైన చెప్పినవే కాకుండా ఈ క్రింది జీవనశైలిని, ఆహార నియమాలను పాటించడం వలన కూడా ఆస్టియో పోరోసిస్ వ్యాధిని నివారించవచ్చు.

1 యోగాలాంటి వ్యాయమం కానీ, వాకింగ్ కానీ ప్రతిరోజు చేయటం వలన ఎముకలకి సరి అయిన రక్తప్రసరణ ఉండేలా చూసుకోవచ్చు.

2. అధికంగా కాఫీ, టీలు తీసుకోకూడదు. రోజుకి మూడు కప్పులకన్నా ఎక్కువ కాఫీ, టీలు తీసుకుంటే ఇవి ప్రేవులలో కాల్షియం వృద్ధిని నిరోధిస్తాయి.

3. శీతల పానీయాలు తీసుకోకూడదు: శీతల పానీయాలు ముఖ్యంగా కోలా పానీయాలు ఎముక క్షయానికి దారి తీస్తాయి. వీటిల్లో ఉండే కెఫీన్, ఫాస్ఫేట్, ఫాస్ఫోరిక్ ఆసిడ్ లాంటి రసాయనాల వలన ఎముక క్షయం జరుగుతుంది.

4. సోయాబీన్స్‌ని రోజువారి ఆహారంలో తీసుకోవాలి. మార్కెట్లో సోయాబీన్స్ యొక్క వివిధ ఉత్పత్తులు దొరుకుతున్నాయి. అయితే ఉడికించిన గింజలను తీసుకోవటం అన్నిటికన్నా ఉత్తమము. సోయాబీన్స్‌లో ఉండే ఐసోఫ్లేవన్స్ అనే ఫైటోఈస్ట్రోజన్స్ ఉంటాయి. వీటి వలన సోయా ఎముక కణజాలంలో జరిగే క్షయాన్ని ఆపుతుంది. సోయాలో గోధుమకన్నా పదిరెట్లు అధికంగా కాల్షియం, మూడు రెట్లు అధికంగా ఫాస్ఫరస్ ఉంటాయి. ఇంకా ఇందులో ఎ.బి.సి.డి.ఇ.కె. విటమిన్లు, మినరల్స్, సమృద్ధికరమైన ప్రోటీన్లు ఉన్నాయి. ఇవన్నీ కలిగి వుండటం వలన సోయాబీన్స్ ఎముకల ఆరోగ్యానికి ఒక సంపూర్ణ ఆహారము.







5. ఫైటోఈస్ట్రోజన్స్‌ని, కాల్షియంను కలిగి ఉండి, కొలెస్ట్రాల్‌ని తగ్గించగలిగే ఇంకొక ఆహారధాన్యం నువ్వులు. నల్లనువ్వుల్లో తెల్లనువ్వులకన్నా ఇవన్నీ అధికంగా వుంటాయి.

6. పల్లెటూర్లలో దొరికే నల్లేరు మొక్క ఎముక సాంద్రతని పెంచుతుందని, ఎముక కణజాలం యొక్క క్షయాన్ని తగ్గిస్తుందని పరిశోధనలలో రుజువయ్యింది. తమిళనాడులోని గ్రామాలలో ఈ మొక్క లేత కాండాలను, వేరుశనగ గింజలను కలిపి పచ్చడిలాగా చేసి తీసుకుంటారు ఆహారంలో.

**నేషనల్ ఆస్టియోపోరోసిస్ ఫౌండేషన్ వాషింగ్టన్ ఎముకలు ఆరోగ్యంగా ఉండటానికి ఈ క్రింది ఆహార అలవాట్లను పాటించాలని సలహా ఇస్తోంది-**

1. పాలు, పాల ఉత్పత్తులు పెరుగు, వెన్న - కాల్షియం కొరకు
2. చేపలు, ఎముకలతో కూడిన సాల్మన్ చేపలు, టూనా చేపలు, సార్డైన్ చేపలు - కాల్షియం, విటమిన్ డి కొరకు
3. కూరగాయలు, పండ్లు ఆకుకూరలు - కాల్షియం.
4. తోటకూర, టమాటో, పొటాటో, చిలగడదుంప, ఎండుద్రాక్ష - మెగ్నీషియం.
5. బొప్పాయి, కమలాలు, అరటిపళ్ళు - పొటాషియం.
6. సిమ్లామిర్చ్, కమలాలు, ద్రాక్ష, స్ట్రాబెర్రీ, బొప్పాయి, ఉసిరి, పైనాపిల్ ఫలాలు - విటమిన్ సి
7. ముదురు ఆకుపచ్చ ఆకుకూరలు, తోటకూర, ముల్లంగి ఆకులు, ఆవాల ఆకులు - విటమిన్ కె

మరి పై సూచనలు పాటిస్తూ, ఆస్టియో పోరోసిస్ వ్యాధి మన దరికి చేరకుండా ఆరోగ్యాన్ని పదిల పరుచుకుందామా!

మహిళా మణిపూస

# విప్లవ యోధ ఉదయం

(మార్చి 31 ఉదయం వర్ధంతి సందర్భంగా)

- వకుళాభరణం లలిత



మోటూరు ఉదయం పేరు తలుచుకుంటేనే మనకు గుర్తుకువచ్చేది సమరశీలమైన ఉదయం. ఆమె క్రియా శీలక కార్యకర్తగా ఎదిగింది. తాను ఎదగడమే కాదు ఇటు మహిళా ఉద్యమంలోనూ, అటు కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగానూ ఎంతో మందిని ఉత్తేజితులను చేసి ఉద్యమంలోకి తెచ్చింది. "ధీరవనిత"అనే మాటకు మోటూరు ఉదయం పూర్తిగా సరిపోతుంది.

తన యావజ్జీవితాన్ని మహిళోద్ధరణకు, ఉద్యమాల నిర్మాణానికి, మహిళలను పోరాటోన్ముఖులను చేయటానికి తన కాలాన్ని శక్తిని వినియోగించిన వ్యక్తి మోటూరు ఉదయం. భారత దేశంలో మహిళా హక్కుల సాధనకు కంకణం కట్టుకున్న కంకణ ధారి ఆమె.

1924 అక్టోబర్ 13 వ తేదీన పుట్టిన ఉదయం 2002 దాకా సుదీర్ఘ ఉద్యమ జీవితాన్ని గడిపిన మోటురు ఉదయం 1942 నుంచే ఆంధ్రరాష్ట్ర మహిళా ఉద్యమానికి నీరుపోసి, నారువేసి పోషించిన ఘనత ఆమెదే. 1948 ఆర్.ఎస్.ఎస్. నాయుకుడు గాడ్సే గాంధీగారిని చంపినప్పటి నుంచి కాంగ్రెసు నాయకులు కమ్యూనిస్టు పార్టీపైనా, ప్రజా సంఘాలపైనా క్రూరమైన దాడులు జరిపారు. వాళ్ళ ఇళ్ళు, పంటలు తగలబెట్టడమే కాక, స్త్రీలను పరమ కిరాతకంగా హింసించారు.

మోటూరు హనుమంతరావు రహస్య జీవనం గడిపినప్పుడు, ఆ తర్వాత కడలూరు జైల్లో ఉన్నప్పుడు, ఉదయం, బిడ్డలు టాన్యా, ఉషలను పెంచి పెద్దచేసి, సిద్ధాంతంవైపు మళ్లించిన ధైర్యవంతురాలు. ఉదయంగారి ఇంటిపై దాడిచేసి ఆమె తండ్రి పర్వతనేని వెంకయ్యను కొట్టి రాజమండ్రి జైల్లో పెట్టారు. హనుమంతరావును కడలూరు సెంట్రల్ జైలుకు పంపారు. ఆమె ఆ బాధను అనుభవిస్తూనే "ఉదయ హృదయఘోష" అనేకావ్యాన్ని రాశారు. నిర్బంధ విధానాన్ని గూర్చి జైలులో రాయటానికి వీల్లేదు కాబట్టి 'గాలివానలు' అని పేరుపెట్టి లేఖల్లో చిత్రించేవారు. ఇంతలో తల్లి పున్నమ్మ కాన్సర్‌తో మరణిస్తే గేయంరాసి ఉదయం



భర్తకు పంపింది. తాను తల్లిలేని పిల్లలాగే రోదిస్తూ గేయం రాసింది.

1952 సాధారణ ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ విజయం సాధించింది. ప్రజా సంఘాలు, ప్రజా ఉద్యమాలు పరవళ్లు తొక్కాయి. పునర్జీవం పోసుకున్నాయి. మానికొండ సూర్యవతి, మల్లుస్వరాజ్యం, మోటూరు ఉదయం 1974లో విజయవాడ, ఒంగోలు, ఖమ్మంలో పాఠశాలలు నిర్వహించారు. పురుషాధిక్య సమాజంలో బాధపడుతున్న వనితలకు అండదండలు అందించిన ఉదయం 54 సంవత్సరాలపాటు మహిళాభ్యుదయం కోసం పాటుపడ్డారు. భర్త హనుమంతరావు యిచ్చిన ప్రోత్సహం, పార్టీ కలిగించిన అవకాశం, కమ్యూనిస్టు పార్టీ అభ్యుదయకర సిద్ధాంతాలు కలిసి ఉద్యమ నిర్వహణకు దోహదం చేశాయి. హనుమంతరావు అయిదున్నర సంవత్సరాలు అండర్ గ్రౌండు జీవితం, జైలు జీవితం ఆర్థికంగా ఆ కుటుంబాన్ని అతలాకుతలం చేస్తే అంగడులు పెట్టి, బజారులో చీరలమ్మి, ప్రజాశక్తి పుస్తకాల షాపులో కొంత కాలం అడ్వర్‌టైజ్‌మెంటు మేనేజరుగా పనిచేస్తూ కుటుంబ భారాన్ని నిర్వహించిన ఉదయం ఎంతో ఆదర్శవంతురాలు. కష్టకాలంలో ఆమెకు ఎంతోమంది అండదండలుగా ఉండేవారు, ఆమెకూడా ఎంతో మందికి ధైర్యాన్ని చేయూతను ఇచ్చారు.

ఉదయంగారు చేసిన కార్యక్రమాల్లో ప్రధానమైనవి 1 మహిళోద్ధరణ 2. కమ్యూనిస్టు పార్టీకి చేసిన సేవ 3.కళాకారిణిగా, మూడు రంగాల్లో ఆమె సేవ చేశారు. వీటన్నింటిని మించి మనస్సున్న మనిషిగా ప్రజలకు ఎన్నో సేవలందించారు.

మహిళోద్యమం కోసం ఎంతో పాటుపడ్డారు. శ్రీకాకుళం నుంచి చిత్తూరు దాకా మహిళా సంఘాల పునర్‌నిర్మాణానికి పాటుపడ్డారు. ఆంధ్రప్రదేశ్‌లో 16 జిల్లాల్లో మహిళా శాఖలు ఏర్పర్చటంలోకాని, మహిళా సాంస్కృతిక దళాన్ని ఏర్పర్చటంలో ఆమె పోరాటం శ్లాఘనీయమైంది. సతీసహగమన వ్యతిరేకోద్యమం, రమీజాబి, షకీలాలపై జరిగిన అత్యాచారాలను ఖండిస్తూ ఉద్యమం జరపటం, ప్రభుత్వానికే సవాలు. షాబాను కేసుపై రాష్ట్రవ్యాప్త ఆందోళన, పోస్టుకార్డుల ఉద్యమం, శ్రామిక

మహిళల కోసం, ప్రసూతి అలవెన్సు, ఆడపిల్లలకు ఆస్థిలో సమానహక్కు కోసం పోరాటం, ఇంటింటికి మరుగుదొడ్లు, వితంతు పింఛన్లు, నర్సింగ్ శిక్షణాలయం మంజూరు చేయించటం. కుటుంబ హింసకు సంబందించిన కేసుల విచారణ, ఈ రకంగా స్త్రీలకు సంబంధించిన అనేక సమస్యలను పరిష్కరించటంలో తన వంతు కృషి చేశారు.

కమ్యూనిస్టు కార్యకర్తగా ఆమె దృఢమైన చిత్తంతో ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు. 1946లో ఏలూరులో డా॥ కొమ్మరాజు అచ్చమాంబ గారిని అభ్యర్థిగా నిలబెట్టినప్పుడు విజయవాడ మహిళా కార్యకర్తలు ప్రచారానికి ఏలూరు వెళ్లారు. శిలలను శిల్పాలుగా మలిచిన ఉదయం చూపిన చొరవ, పట్టుదల కార్యకర్తలకెంతో ఉత్తేజాన్ని కల్గించింది. కమ్యూనిస్టుపార్టీపై నిషేదం తొలగి బహిరంగంగా కార్యక్రమాలు సాగించినప్పటినుంచి సాగిన ఆమె రాజకీయ జైత్ర యాత్ర అప్రతిహతంగా సాగింది. మార్క్సిజం పాఠాలు నేర్చుకున్న నాటినుంచి తుదిశ్వాస వరకు అకుంఠిత దీక్షతో మార్క్సిస్టు పార్టీకి సేవలందించింది. విరాళాలు సేకరించి, ఆర్థిక ఇబ్బందులను తీర్చింది. మహిళా సంఘం నిర్మాతల్లో ఒకరుగా ఉద్యమాలను ముందుకు నడిపించారు.

రాష్ట్రంలో అన్ని జిల్లాల్లో అరెస్టు అయిన నాయకులందరి భార్యలను కూడ గట్టి ధైర్యం చెప్పింది. డిటెన్షనును ఖండిస్తూ డిటెన్యూల భార్యలను, కుటుంబాలనూ సమీకరించి విజయవాడ నుంచి అందర్నీ తీసుకుని ముఖ్యమంత్రి దగ్గరకు వెళ్ళి డిమాండ్లను అమలు జరుగునట్లు చేయగల శక్తి సామర్థ్యాలు ఉదయంకే ఉన్నాయి. ఆమె ఉత్తేజ భరిత పాత్ర కార్యకర్తలందరిలో చెరగని ముద్రవేసింది. 18 సంవత్సరాలు రాష్ట్ర సంఘం ప్రధాన కార్యదర్శిగా ఎనలేని సేవలందించారు. జీవితమంతా ఉద్యమంలో పండిపోయిన వ్యక్తి ఆమె.

ఉదయం, చింతపల్లి కోటేశ్వరమ్మ, పార్వతితో కూడిన దళం, రాష్ట్రంలోనే మొదటి బుర్రకథ దళం. రష్యన్లు వీళ్ల ఫోటో తీసి మాస్కోలో పెట్టారట. ఉదయం పాడుతుంటే "మైక్"తో పనిలేదు అనేవాళ్ళు

రేణు చక్రవర్తి, హజరా బేగం మొదలైన వారి ముందు చెప్పిన అల్లూరి సీతారామరాజు బుర్రకథ గొప్ప విశేషం. రాజారావు గారు వీళ్ళతో మద్రాసులోని రాజాజీ హాల్లో కూడా కథ చెప్పించారు. అప్పుడు ' వన్స్ మోర్' అని అరిచారు. " మహిళా వాణి" క్యాసెట్ వాళ్ల పాటలతో మారుమోగింది. రచయిత్రిగా కూడా ఆమెకు మంచి పేరుంది. 'బాలభారతం' 'ఆదర్శదీపాలు' మొదలైన ఎన్నో గ్రంధాలు రాశారు. గాయినిగా, కవయిత్రిగా ఆమెకు ఆమే సాటి. సమాజంలో మానవిగా ఆమె చేసిన సాహసం చాలా గొప్పది. ఉదయం, మోటూరు హనుమంతరావు దంపతులు ఆదర్శవంతంగా, మానవతా మూర్తులుగా సమాజానికి, పార్టీకి సేవ చేశారు. తమ బిడ్డలు టాన్యా, ఉషలను సమాజానికి ఉపయోగకరమైన బిడ్డలుగా తీర్చిదిద్దారు. ధీరవనిత అనే పదానికి ప్రతిబింబంగా ఉదయం అందరి మనస్సుల్లో చిరస్థాయిగా నిలిచిపోయారు.



# భీతిగొల్పే మతోన్మాదం

-వేములపల్లి సత్యవతి

దభోల్కర్ ప్రఖ్యాతిగాంచిన హేతువాది. మహారాష్ట్రలోని సతారాలో నవంబర్ 1, 1945లో జన్మించారు. పూర్తిపేరు నరేంద్ర దభోల్కర్. యం.బి.బి.యస్‌లో వైద్య పట్టాపొంది 12 సంవత్సరాలు వైద్యునిగా పనిచేశారు. అంకితభావంతో వైద్యసేవలందించి ప్రజా వైద్యునిగా పేరుగాంచారు. తర్వాత దానిని వదలివేసి "అఖిల భారత అంధ శ్రద్ద నిర్మూలన సమితి"లో సభ్యునిగా చేరారు. శాస్త్రీయ దృక్పథంగల సామాజిక కార్యకర్తగా పనిచేయటం మొదలు పెట్టారు. అందుకు ప్రత్యేక శిబిరాలను నిర్వహించి విద్యార్థులలో శాస్త్రీయ అవగాహనను కలిగించారు. 15 సంవత్సరాలు కృషి చేసి శాస్త్రీయ దృక్పథం కలిగిన 10 వేలమంది ఉపాధ్యాయులను తయారు చేశారు. బాబా అధవే ప్రారంభించిన "ఒక ఊరు ఒక బావి" ఉద్యమాన్ని చేపట్టారు. గ్రామాలలో విరివిగా తిరిగి ప్రజలలో దానిని ప్రచారంచేసి చైతన్యం కలిగించటానికి నిర్విరామ కృషి చేశారు. "ఒక ఊరు ఒక బావి" ఉద్యమ లక్ష్యం ఒక ఊరిలోని అన్ని కులాలవారు ఒక బావిలోని నీరే తాగాలి. దీని వలన అస్పృశ్యతను దూరం చేయవచ్చునన్న సంకల్పం.

జోగినీ సాంప్రదాయాన్ని వ్యతిరేకించారు. దేవదాసి వృత్తిని ఖండించారు. బాబాల మంత్ర తంత్ర వైద్యులు, బాణామతి, చేతబడి మొదలగు మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా మహారాష్ట్ర ప్రభుత్వం చేత చట్టం చేయించడానికి వారిపై ఊపిరి సలపని వత్తిడి తెచ్చారు. ఒక దశలో రాష్ట్ర ప్రభుత్వం చట్టం చేయడానికి ముందుకొచ్చింది. కానీ భారతీయ జనతాపార్టీ, శివసేనలాంటి రాజకీయ పార్టీలు, వార్కరీ తెగలవారు ఇది హిందూ సంస్కృతికి, సాంప్రదాయాలకు విరుద్ధమని వ్యతిరేకించాయి. ప్రసిద్ద మరాఠీ వార పత్రిక 'సాధనకు 16 సంవత్సరాలు సంపాదకులుగా పనిచేశారు. ప్రజలలోని అంధ విశ్వాసాలను ఆధారం చేసుకుని పబ్బం గడుపుకునే మతఛాందసులు, బాబాల, స్వామివార్ల గుట్టులను పత్రికలలో వ్యాసాల ద్వారా బట్టబయలు చేశారు. మరాఠా విశ్వవిద్యాలయాన్ని బాబాసాహెబ్ అంబేద్కర్ విశ్వవిద్యాలయంగా పేరు మార్చాలనే ఉద్యమాలలో పాల్గొని చురుకుగా పనిచేశారు. ఖాప్ పంచాయితీ పెద్దలకు దభోల్కర్‌కు మధ్య ఘర్షణలు జరిగాయి. వీరిని సమర్ధించిన హిందూ తాలిబన్లను వ్యతిరేకించారు. మతమౌఢ్య మూసలో పోతపోసిన వారు ఏ మతస్థులైనా తాలిబన్లే. గాంధీ హంతకులమని, నిన్నూ హతమారుస్తామని అప్పుడప్పుడు తెలియని వారినుంచి హెచ్చరికలు దభోల్కర్‌కు వచ్చేవి. ఆయన ఇసుమంతకూడా జంకలేదు. బెదరలేదు. పైగా తాను సూచించిన పది మహిమల్లో ఒక్కదాన్ని రుజువు చేసినా అయిదులక్షల రూపాయలిస్తానని దభోల్కర్ సవాల్ విసిరారు. ఎవరూ ముందుకురాలేదు. 30 సంవత్సరాలకు పూర్వమే పుట్టపర్తి సాయిబాబాకు బెంగుళూరులోని నరసింహులు అనే ప్రొఫెసర్ గాలిలో చేయితిప్పి విభూదిలాంటి క్రియలను తాను చేసి చూపించగలనని, అవి మహిమలు కావని బహిరంగంగా వేదిక మీదకు రావలసినదిగా సవాల్ విసిరారు. కాని బాబా రాలేదు.. కీ॥శే॥ మదర్‌థెరిస్సాకు 'సెయింట్‌హుడ్' ప్రదానం చేసినపుడు పోప్‌కు దభోల్కర్ 'అద్భుతాలు' కంటె హేతుతత్వంపై ఆధారపడటం శ్రేయస్కరమని ఉత్తరం రాశారు.

69 సంవత్సరాలు దభోల్కర్ రోజు ఉదయం వాకింగ్‌కు వెళతారు. 20 ఆగష్టు 2013న కూడ రోజులాగే వాకింగ్‌కు వెళ్ళారు. పూణే ఓంకారేశ్వర ఆలయం దగ్గరకు రాగానే ఇరువురు గుర్తు తెలియని దుండగులు ఆయనను అక్కడే కాల్చి చంపారు. ఘటనా స్థలానికి 30 అడుగుల దూరంలో పోలీసు స్టేషనుంది. కానీ పోలీస్‌స్టేషన్‌లోని వారికి తుపాకులతోగాని, లేక పిస్టళ్ళతో కాల్చిన శబ్దం వినపడ లేదు. వెంటనే రాలేదు. హంతకులు తమ బైకులను పోలీస్ స్టేషన్ బయటే పార్కు చేశారు.

పోలీసుల సహాయంతోనే ఆ గూండాలు దురాగతానికి పాల్పడ్డారన్న వార్తలు ప్రచురితమయినవి. కళంకరహితుడైన నిస్వార్థ సామాజిక కార్యకర్త, ప్రముఖ హేతువాది, ప్రజా వైద్యునిగా పేరుగాంచిన నరేంద్ర దభోల్కర్‌ను హిందూ తాలిబన్లు గూండాల చేత హతమార్పించారు. ముంబాయిలో మాఫియా వాళ్ల కార్యక్రమాలను పత్రికల్లో వెల్లడించి నందుకు ఆ పత్రికా విలేఖరి బైకు మీద ఆఫీసుకు వెళ్లే సమయంలో పగలే రోడ్డు మీద పిస్టళ్ళతో కాల్చి చంపారు. మన రాష్ట్రంలోనూ ఇసుక మాఫియా, ఎర్రచందనపు మాఫియావాళ్ళను పట్టుకోవటానికి ప్రయత్నించిన అధికారులపై పోలీసులపై తిరగబడటం, దాడులు చేయటం, కాల్పులు జరపటంలాంటి వార్తలు పత్రికల్లో చదువుతూనే వున్నాం. దభోల్కర్ ప్రతిపాదించిన మూఢనమ్మకాల వ్యతిరేక బిల్లును 13-12-2013న మహారాష్ట్ర ప్రభుత్వం ఆమోదించింది. బిల్లు ఆమోదం పొందిన రోజునే థానేలో ఒక మహిళను బలియిచ్చారు.

కేరళలో ఒకపేద ముస్లిం మహిళ, ముగ్గురు బిడ్డలతల్లి ఇసుక మాఫియాకు వ్యతిరేకంగా పోరాటానికి దిగింది. ఆమె గ్రామం సముద్రతీరాన వున్నది. ఎక్కడ నుంచో లారీలు రావటం, కూలీలు రావటం లారీలనిండ తీరపు ఇసుకను తీసుకెళ్ళటం గమనించింది. వాళ్ల జీవనాధారం సముద్రం. సముద్రంలో భూభాగం కలిసిపోతే తమ జీవనాధారం పోతుందని తలచింది. గ్రామీణులందరం కలిసి వారిని ఎదుర్కొందామన్నది. ఎవరూ ముందుకు రాలేదు. ఆమె మండలాఫీసు ముందు, జిల్లా కలెక్టరాఫీసు ముందు, కేరళ సెక్రటేరియట్ ముందు ఆందోళన చేపట్టింది. ఏమి కదలిక కనిపించలేదు. చివరకు ముగ్గురు పిల్లలతో రాజధాని ఢిల్లీకి చేరింది. జంతర్ మంతర్ రోడ్డులో ప్లాస్టిక్ కవర్లతో వుండటానికి ఒకటెంట్ వేసుకుంది. ఒక గుడ్డపై 'ఇసుక మాఫియాను నియంత్రించండి' అన్న



నినాదం రాయించి రెండు వైపులా కర్రలతో ఆమె ఇద్దరు ఆడపిల్లలు నిలబడ్డారు. అప్పుడు మీడియా దృష్టిపడి విషయం పత్రికలకెక్కింది. కాని నేటి వరకు కేరళ రాష్ట్ర ప్రభుత్వంలోగాని, కేంద్రంలో గాని ఎలాంటి కదలికలేదు. ఎముకలుకొరికే చలిలో ఆ పేదరాలు పిల్లలతో కలిసి చేస్తున్న పోరాటానికి పరిష్కార మార్గం దొరకాలని కోరుకుందాం.

దేశం రెండు ముక్కలయి పాకిస్థాన్ ఏర్పడింది. పాకిస్థాన్ నిర్మాత మహమ్మదాలీ జిన్నా " ఖ్వాయిదే ఆజం జిన్నాగా పేరుగాంచారు. ఆ దేశ ప్రథమ అధ్యక్షులుగా నియుక్తులయ్యారు. దేశాధ్యక్షునిగా చేసిన ప్రసంగంలో ఇక్కడ వున్న మైనార్టీలకు కూడా మెజార్టీ వారికున్న అన్నిహక్కులు, సదుపాయాలు వుంటాయని, వీరు కూడా ఈ దేశపౌరులేనని పేర్కొన్నారు. అంతేకాదు పాకిస్థాన్ రాజ్యాంగాన్ని ఉర్దూలో ప్రతిభ కలిగి పేరు ప్రఖ్యాతులు గాంచిన ఒక హిందూ కవి చేత రాయించాడు. ఖ్వాయిదే ఆజం జిన్నా నివసించిన భవనాన్ని తాలిబన్లు కూలగొట్టి సర్వనాశనం చేశారు. 121 ఏండ్ల చరిత్ర కలిగిన పురాతన కట్టడమది. ఆ భవనానికి కాపలావున్న పోలీస్‌ను కూడా కాల్చివేశారు. ఈ దారుణ హింసాకాండ తమదేనని బెలూచిస్థాన్ లిబరేషన్ ఆర్మీ ప్రకటించింది. కాని జిన్నా తదనంతరం మిలటరీ పాలనే ఎక్కువ కాలం కొనసాగింది. మత మౌఢ్యంతో మూసపోసిన తాలిబన్లు తయారయ్యారు. వారిని ప్రోత్సహించింది ప్రపంచ పెద్దన్నగా పెత్తనం చెలాయిస్తున్న అమెరికా. భారత వ్యతిరేకతతో పాకిస్థాన్ కూడా భాగస్వామియై వారికి దేశంలో స్థావరం ఏర్పాటు చేసింది. 'నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష' అన్నట్లు తాలిబన్లు అమెరికాకు తమ సత్తా రుచి చూపించారు. వీరు చేసిన విమానదాడిలో వేలమంది ప్రాణాలు గాలిలో కలిసి పోయాయి. తర్వాత అమెరికా పటిష్టమైన భద్రతా చర్యలు చేపట్టింది. భారత్‌కు మాత్రం నేటికి తాలిబన్ల ముప్పు తప్పలేదు. ఇప్పుడు ఆశ్రయమిచ్చి పెద్ద చేసిన పాకిస్థాన్‌కు తాలిబన్లు తమ తడాఖా రుచి చూపిస్తున్నారు.

పాక్‌లోని క్వెట్టా మహిళా విద్యాలయంలో చదువుతున్న విద్యార్థినులు పాఠశాల వదలిన తర్వాత ఇండ్లకు వెళ్ళటానికి బస్సులో కూర్చున్నారు. ముష్కరులు నిర్దాక్షిణ్యంగా బస్సును బాంబుతో పేల్చి వేశారు. పెద్ద శబ్దంతో బస్సు గాలిలోనికి లేచింది. బస్సులోని 23మంది బాలికల ప్రాణాలు గాలిలో కలిసి పోయాయి. వారి శరీరాలు తునాతునకలయ్యాయి. ప్రఖ్యాత గాయనిగా ఆదేశంలో పేరుగాంచిన గాయకురాలిని కాల్చి చంపారు. సంగీతం ఇస్లాంకు వ్యతిరేకమట. మైనార్టీ ప్రజల

ఆడపిల్లలను ఎత్తుకుపోయి బలవంతంగా తమ మతానికి చెందిన వారికిచ్చి పెండ్లిండ్లు చేస్తున్నారు. మతాంతీకరణ చేసి పేర్లు మారుస్తున్నారు. పాకిస్థాన్ పాఠశాలల్లోని పాఠ్యపుస్తకాలలో భారత వ్యతిరేకతను కలిగించే పాఠ్యాంశాలు బోధింపబడుచున్నాయి. ఈ విషయం గౌరవనీయులు సీనియర్ పాత్రికేయులైన కులదీప్ నయ్యర్‌గారు రాసిన వ్యాసంలో (చదువుకు సంబంధించిన) చదివాను. పెషావర్‌లో చారిత్రాత్మకమైన చర్చివుంది. 22-9-13 ఆదివారం రోజున 600మంది క్రైస్తవులు ఆచర్చిలో ప్రార్థనలో పాల్గొన్నారు. ప్రార్థన ముగిసిన తర్వాత అందరూ బయటకు వస్తున్న సమయంలో ఉగ్రవాద ఆత్మాహుతి దళ సభ్యులు రెండు శక్తివంతమైన బాంబులు పేల్చారు. ఆ భీకర దాడిలో 78మంది అక్కడికక్కడే అసువులు బాశారు. మృతుల్లో 30మంది మహిళలు 7గురు చిన్నారులు వున్నారు. చర్చి లోపల ప్రాంగణమంతా రక్తసిక్తమయింది. ఎటు చూసిన హాహాకారాలు మిన్నంటాయి. ఆ దహనకాండ యుద్ధరంగాన్ని తలపింప జేస్తున్నది. పాక్ ప్రధాని నవాజ్ షరిప్ తీవ్రంగా ఖండించారు. మైనార్టీ ఆడపిల్లల విషయంలో కూడా పాక్ ప్రభుత్వం తీవ్రంగా ఖండించటం తప్ప నిర్మూలింపజేయలేక పోతున్నది. బెంగాల్‌కు చెందిన సుస్మిత బెనర్జీ ఆఫ్ఘన్ దేశీయుడైన వ్యాపారిని వివాహమాడి ఆదేశంలోనే వుంటున్నది. 1995లో ఒకసారి తాలిబన్ల చెరనుండి తప్పించుకున్నది. 2013లో రెండవసారి ఇంటి నుంచి బయటకు తీసుకొచ్చి కాల్చిచంపారు. భారత గూఢచారిణి అని అందుకే హతమార్చామని చెప్పారు. ఆమె రాసిన " కాబూలీవాలా-బెంగాలీభార్య" అనే గ్రంథం ఆంగ్లంలోనికి అనువదింపబడి 7లక్షల కాపీలు అమ్ముడుపోయాయి.

ఉత్తర ప్రదేశ్‌కు చెందిన ముజఫర్‌నగర్ జిల్లాలో కవాల్ ఒక చిన్న గ్రామం. గౌరవ్, సచిన్‌లిరువురు సోదరులు. షావ్వాజ్ అనే యువకుడు వారి సోదరిని లైంగికంగా వేధించి అత్యాచారానికి పాల్పడ్డాడన్న ఆవేశంలో షావ్వాజ్ పై దాడి చేసి చంపివేశారు. గౌరవ్, సచిన్‌లు జాట్‌కు చెందినవారు. చంపబడినది ముస్లిం. షావ్వాజ్ కుటుంబీకులు, బంధువులు కలిసి గౌరవ్, సచిన్‌లను చంపివేశారు. ఈ ఘటన 27-ఆగష్టు 2013న జరిగింది. ఒకేరోజు మూడు హత్యలు జరిగాయి. ఇది దావానలంలా జిల్లా అంతటా వ్యాపించి హిందు-ముస్లిం మతకలహాల రూపం దాల్చింది. ఆ సమయంలో జరిగిన మత కలహాలు, చెలరేగిన విద్వేషం, విధ్వంస కాండ దేశాన్ని కుదిపివేసింది. దిగ్భ్రాంతికి గురిచేసింది. గౌరవ్, సచిన్‌లు చట్టాన్ని చేతుల్లోకి తీసుకోకుండా నిందితునిపై కేసుపెడితే ఇంత మారణకాండ జరిగేది కాదు. క్షణికావేశంలో కానరాని, వినరాని ఘోరాలు జరిగిపోతున్నాయి.

భారత్‌కు చెందిన రజియాకు, పాకిస్థాన్‌కు చెందిన మలాలాకు ఒక్క చదువు విషయంలో తప్ప దేనిలోనూ సారూప్యత లేదు. రజియా మీరట్ జిల్లాలో నిరుపేద కుటుంబంలో పుట్టింది. మీరట్‌లో ఫుట్‌బాల్స్ తయారు చేసే ఫ్యాక్టరీలు చాలా వున్నాయి. పేదరికం వలన తల్లితండ్రులు తమ పిల్లలను చిన్ననాటి నుంచే ఫ్యాక్టరీలలో పని చేయటానికి పంపుతారు. బాల్యం నుంచి రజియాకు చదువుకోవాలన్న బలమైన కోర్కెఉండేది. నెరవేరే మార్గం కనిపించలేదు. అందరితోపాటు ఫ్యాక్టరీలోపని చేసేది. యుక్త వయసు రాగానే రజియాకు తాను బాల్యంలో కోల్పోయినదేమిటో అర్థమయింది. తాను కోల్పోయిన చదువును మిగతావారు కోల్పోకూడదని నిశ్చయించుకుంది. పిల్లలను ఫ్యాక్టరీలకు పంపవద్దని, చదువుకోవటానికి బడులకు పంపాలని ఉద్యమం చేపట్టింది. ఇంటింటికి తిరిగి తల్లి-తండ్రులకు నచ్చజెప్పి ఒప్పించడానికి శ్రమించింది. ఆమె శ్రమ ఫలించి పిల్లలను బడికి పంపసాగారు. ఆమె కృషికి ఈ సంవత్సరం జులైలో ఐరాస 'యూత్ కరేజ్' అవార్డు ప్రకటించటం జరిగింది. ఇటువంటి మలాలాలు మరెంతోమంది వీధుల్లోకి రావాలని కోరుకుందాం!

**25వ పేజీ తరువాయి**

ఎలక్ట్రానిక్ మీడియా వంటి అధునాతన టెక్నాలజి కూడా మహిళలపై సైబర్ నేరాలు పెంచుతున్నాయి. సామాన్యులే కాదు, రాజకీయ, న్యాయ, పోలీస్, మీడియా, ఆధ్యాత్మిక వాదులు,బాబాలు వ్యవస్థలో పెద్ద మనుషులుగా చలామణి అయ్యేవారు కూడా మహిళలపై లైంగిక దాడులకు పాల్పడుతున్నారు. నిర్భయ అత్యాచార నిరోధక చట్టం, లైంగికవేధింపుల నిరోధక చట్టం వచ్చిన తర్వాత కూడా ఒక్క ఢిల్లీలోనే సంవత్సర కాలంలో 1498 అత్యాచార ఘటనలు, 3796 లైంగిక నేరాలు జరిగినట్లుగా నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో తెలియజేస్తుంది. సమాజంలో మహిళల యెడల వున్న దృక్పథం మారాలి. ఒక ప్రక్క స్త్రీలు పురుషులతోపాటు అన్ని రంగాలలో పురోగతిని సాధిస్తున్నారు. ఈ వాస్తవాన్ని ఒప్పుకోని సమాజం, స్త్రీలు పురుషుని కంటే తక్కువని వారిని అణగిమణిగి ఉండాలనే ఫ్యూడల్ ఆలోచనా విధానంతో ఉన్నది. ఈ పురోగతి సహించలేకనే దాడులు పెరుగుతున్నాయి. హింసలేని సమాజం మహిళల హక్కని ఉద్యమించాలి.

**రాజకీయ సాధికారిత:** పితృస్వామ్య భావజాలం వేళ్ళూనుకున్న సమాజంలో మహిళా రాజకీయ సాధికారత ఎన్నికల వాగ్దానంగానే మిగిలిపోయింది. చట్ట సభలలో 1/3వంతు మహిళా రిజర్వేషన్ బిల్లు రాజ్యసభలో ఆమోదించి 3సం॥రాలు గడిచినా లోక్‌సభలో ప్రవేశపెట్టకుండానే 15వ లోక్‌సభలు ముగిసిపోయాయి. భారతదేశంలో మహిళల యెడల ఉన్న వివక్ష, పురుషాధిక్యత ధోరణులు ప్రస్ఫుటంగా తేటతెల్లమవుతున్నాయి.

ప్రస్తుతం ఉన్న ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక నేపథ్యంలో మహిళలపై జరుగుతున్న ముప్పేట దాడికి వ్యతిరేకంగా అసంఖ్యాక బాధిత మహిళలను సమీకరించి ఐక్య పోరాటాలు చేద్దాం. మహిళా హక్కుల కోసం పోరాడుతామని ప్రతినబూనుదాం.

**మహిళా హక్కులకై గళం విప్పుదాం!**

**హింసలేని సమాజాన్ని నిర్మిద్దాం!!**

అవగాహన సందర్భం

# జీవించడమొక 'కళ'

–శిలాలోలిత

పుట్టిన ప్రతి మనిషీ మరణించక తప్పదు. మరణం అనివార్యమైనప్పుడు జీవించే క్షణాలను అపురూపమైనవిగా భావించాలి. "పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా" అని వేమన ప్రశ్నించినట్లే మనకు కూడా మనం వేసుకోవాల్సిన ప్రశ్న ఇది. ఒక లక్ష్యం, గమ్యము, ఏర్పరచుకోకపోతే శున్యమే మిగులుతుంది.

క్షణికమైన జీవితం కొరకు వెంపర్లాటలు, వేదనలు, మోసాలు, ద్వేషాలు, డబ్బుకక్కుర్తులు, కీర్తి వ్యామోహాలు, భయసందేహాలు, అవసరమా? అన్పిస్తుంది.

జీవితాన్ని ఒక ఉత్సవంలాగా, జీవనానందాన్ని మిగిల్చే శక్తిలాగా మలచుకోగలగాలి.

కొండవీటి సత్యవతి ఓ కథలో అంటుంది. 'సంతోషం ఎక్కడో లేదు. మన చుట్టూనే ఉంటుంది. దాన్ని గుర్తించి పొందగలగడమే జీవితం' అని. అలా మనం చుట్టూ చూడాలి. చిన్న చిన్న విషయాలు కూడా గొప్ప ఆనందాన్ని ఇవ్వగలవు. ఒక తొలి కిరణం మనని స్పృశిస్తేనో, ఓ గాలి తెమ్మెర తాకితేనో, ఒక పువ్వు విరిసీ విరియకుండానే నవ్వుతుంటేనే, ఓ మంచు బిందువు నేను ముత్యాన్ని సుమా అని ఊరిస్తుంటేనో, ఒక పసిపాప కేరింతలోనో, ఒక శ్రమజీవి సౌందర్యంలోనో, ఆకలి విలువ తెలియజేసే అన్నం మెతుకులోనో, రోడ్డు పక్క చలికి ఒణుకుతున్న ముదుసలి శరీరాన్ని కప్పుతున్న రగ్గును చూసి వెలిగిన ఆ కళ్ళలోనో, అమ్మ నాన్నల చిరునామా తెలీని జీవితాలలో ప్రేమను, జీవితాన్ని నింపినపుడో, ఒక అద్భుతమైన రచన చదివినప్పుడో, ఒక ఉద్వేగ భరిత ఉపన్యాసం విన్నప్పుడో, న్యాయ పోరాటంలో గెలిచిన స్త్రీ మూర్తుల ఉత్సాహంలోనో, ఇక్కడ అక్కడని కాదు అన్వేషించ దలుచుకుంటే, చూసే మనసు, కళ్ళు ఉంటే మనచుట్టూ కూడా ఆనందం, సంతోషం దొరుకుతూనే ఉంటాయి.

స్త్రీలకు కుటుంబాల్లో ఉండే బాధ్యతలు, బరువులతోపాటు వెసులుబాటు తక్కువ. ఐనప్పటికీ, చిన్న చిన్న సరదాలు సైతం పోగొట్టుకుంటూ, సర్దుకు పోవడమే జీవితమనుకుంటారు. ఒక అనాసక్త జీవితాన్ని చాలా మంది గడుపుతుంటారు. 'నులివెచ్చని కిరణాలు మీద పడ్తుంటే, పూల మొక్కల్ని పలకరిస్తూ, పేపర్ తిరగేస్తూ ,వెచ్చటి కాఫీ, తీరిగ్గా కూర్చుని తాగడం నాకెంతో ఇష్టం. కానీ ఈ నలభై ఏళ్ళ జీవితంలో అది సాధ్యపడలేదు' అని ఆమె దిగులుగా అంటుంటే నవ్వొచ్చింది. నిజానికి ఇది చాలా చాలా చిన్న కోరిక. దాన్ని సాధించుకోవడం చాలా తేలిక. అది నెరవేర్చుకోవాలన్న పట్టుదల ఉండాలి. ఇది మచ్చుకి మాత్రమే. ఇలాంటి చిన్న చిన్న సరదాల్ని ఆనందాల్ని కోల్పోవాల్సిన అవసరం లేదు. మన మనసుకిష్టమైన పనిని, అది ఎవ్వరికీ హాని చేయనిదీ నొప్పించనిదీ ఐతే చాలు. ఎవరెస్టు శిఖరాన్నయినా మనం ఎక్కగలం. ముందుగా మన మనస్సుల్లో పాతుకుపోయిన అభిప్రాయాన్ని మార్చుకోవాలంతే.

ఒక పాజిటివ్ ఆలోచనా విధానాన్ని అలవర్చుకోవాలి. నాకే కష్టాలు, నాకే అడ్డాలు, నాకే దుఃఖాలు, నేను పడినంతగా ఎవరూ పడడం లేదు, ఈ జన్మకు సుఖంలేదు అని నిర్ణయం బలంగా చేసుకుని అభిప్రాయాలు మార్చుకోనంత వరకు భూతద్దంలో చూసినట్లుగా బాధలు రెట్టింపు అవుతాయి. కాబట్టి మారాల్సింది ముందుగా మైండ్‌సెట్. హార్ట్‌సెట్. "ఒక గీతను చెరపకుండా చిన్నది చేయాలంటే మహా మంత్రి తిమ్మరుసు ఉన్న గీత కిందనే పెద్ద గీత గీసారట." అలాగే మనకొచ్చిన, ఉన్న కష్టాన్ని, దుఃఖాన్ని తగ్గించుకోవాలంటే, మనకంటే ఇంకా భయంకరమైన జీవితాన్ని గడుపుతున్న వాళ్ళను గుర్తిస్తే మనకష్టం చిన్నదై పోతుంది. వాళ్ళంత లేవు కదా అనే ఆలోచనలొచ్చాక మన దృక్పథంలో మార్పువస్తుంది.

కుటుంబాల కోసం శ్రమపడటం, పాటుపడడం, త్యాగాల ముద్దలవడం ఎంతో కాలంగా చేస్తున్న పనే. మరొక్క అడుగు ముందుకేసి, సమాజానికి మనమేం చేయగలం అని ఆలోచించుకుంటే చాలా పనులున్నాయి మనముందట.

మన మనసుకిష్టమైన పనిని ఎంత శ్రమ అయినా చెయ్యగల సమర్థత మనకుంది. మనలో దాగున్న ఆ అగ్నిని వెలిగించుకోగలగాలి. మనం మరణించే లోపుగా ఎంతమందికి సాయపడగలం, ఎన్ని మంచి పనులు చేయగలం అని ఆలోచించుకోగలిగితే బాగుంటుంది. జిడ్డుకృష్ణమూర్తి ఫిలాసఫీలో ప్రతిక్షణంలోనూ జీవించమన్నాడు. అలా ఎప్పటికప్పుడు మన విజయాల్ని, సంతోషాల్ని, ఉత్సాహాన్ని రీకలెక్ట్ చేసుకుంటూ నూతనోత్సాహంతో గడపడమే నిజమైన జీవితం. పుట్టినపుడు ఎలా ఒంటరిగా ఈ లోకంలోకి ప్రవేశించామో అలాగే వెళ్ళి పోతామన్న చిన్న నిజాన్ని అంగీకరించగలిగితే ఇన్ని దౌర్జన్యాలు, ఇంత హింసాపూరిత వాతావరణం, ఇంత ఆధిపత్య ధోరణులు, ఇంత డబ్బు లాలసలు ఉండవన్పిస్తుంది. దుఃఖాన్ని, విషాదాల్ని, వియోగాల్ని మర్చిపోతూ, ప్రతిక్షణం ఆనందంగా ఉంటే, చుట్టూ వాతావరణాన్ని కూడా చైతన్యవంతంగా చేసుకుంటూ బతుకు బండిని సునాయాసంగా మలచుకోగలగడం బుద్ధి జీవుల లక్ష్యం కావాలని నా ఆకాంక్ష. ఎటుచూసినా గొప్ప జీవనానందాన్ని అనుభవిస్తున్న మానవ సందోహమే నాకంటి ముందున్న రేపటికల. ●

*with best complements from*



# పాకలపాటి తాతబ్బాయి-అపర్ణ



**6-11-2013**న కృష్ణాజిల్లా
పొట్టిపాడు గ్రామంలో వివాహం జరిగిన
సందర్భంగా చైతన్యమానవి
శుభాకాంక్షలు తెలియజేస్తుంది.

మీడియా

# ఈ భావజాలంతో ఎటువైపు?

-కె. సమత

సెంట్రల్ యూనివర్శిటీలో చాయ్ బండి దగ్గర జరిగే సాధారణ సంభాషణల్లో కూడా గొప్ప విషయాలు, సిద్ధాంతాలు ఉంటాయని, పుస్తకజ్ఞానాన్ని మించిన సమాచారం, ఆలోచనలు అలాంటి చోట్ల దొరుకుతాయని ఎవరూ ఊహించరు. సాయంత్రం అవ్వగానే గుంపులు, గుంపులుగా కూర్చోని ఛాయ్ బండి దగ్గర ఉన్నవాళ్ళని చూస్తే 'వీళ్ళకేం పనిలేదా? ఎప్పుడు చూసినా ఇక్కడే ఉంటారు' అనుకునే దాన్ని. కొద్దికాలంలోనే నేను కూడా ఆ గుంపుల్లో ఒకదాన్ని అయ్యాను. మొదటి రోజు ఒక రకమైన అనుభూతి కలిగింది. వాళ్ళు మాట్లాడుకునే సిద్ధాంతాలు, పదజాలం నాకేమీ అర్థం కాలేదు. నేనెక్కడున్నానా? అనిపించింది. ఇక ఈ చర్చల్లో నేను కూడా సీరియస్‌గా పాల్గొనాలి అనుకున్నాను. మరుసటి రోజునుంచి నేను కూడా చర్చల్లో చురుగ్గా పాల్గొనడం ఆరంభించాను. అనేక విషయాలు మాట్లాడుతూ ఉంటాం. ప్రతి దానికీ అర్థాలు, కారణాలు వెతికే ప్రక్రియలో తెలియకుండానే అనేక సిద్ధాంతాల్ని సంభాషణల్లో వాడుతూ ఉంటాం. దాంతో మామూలుగా కొరుకుడుపడని సిద్ధాంతాలు సైతం చాలా సులువుగా అర్థమయ్యేవి.

ఈ సంభాషణల్లో భాగంగానే ఓ రోజు ముగ్గురు స్నేహితులం చాయ్ బండి దగ్గర కూర్చొని సినిమా పాటల గురించి మాట్లాడుకున్నాం. మా ముగ్గురిలో మూడు రకాల అభిరుచులు. నాకేమో కొత్త పాటలు, ఇంకొకరికి పాత పాటలు, మరొకరికి మధ్య తరం(80వ దశకం)లో వచ్చిన పాటలంటే ఇష్టం. అలా మా అభిరుచుల గురించి



మాట్లాడుతుంటే సంభాషణ ఎక్కడి నుండి ఎక్కడికో వెళ్ళింది. ఆలోచింపచేసే అనేక విషయాలు...

'సాహిత్యంలో మంచిది లేకపోలేదు. అది కొత్త, పాత అన్ని తరాలకు వర్తిస్తుంది. అలాగే ద్వంద్వ అర్థాలతో కూడిన అశ్లీల సాహిత్యం కూడా అన్ని తరాలకూ వర్తిస్తుంది. "అబ్బబ్బ! ఏం పాటలో ఏంటో! కొంచెం మంచి పాటలు వినండర్రా!" అని మన అమ్మ-నాన్న, అమ్మమ్మ-తాతయ్యలు అంటూ ఉంటారు. వాళ్ళకి మంచి పాటలు అంటే వాళ్ళ తరంలో హిట్ అయిన పాటలే! మరి ఆ పాటల్లో ఎంత మంచి సాహిత్యం, ఎంత అశ్లీల సాహిత్యం ఉందో ఆలోచించారా?'

మా సంభాషణల్లో వచ్చిన సారాంశం ఇదే! నా అభిరుచి గొప్పదంటే, నాదంటూ వాదించి సాహిత్యం నుండి సామాజికం వరకూ అన్ని అంశాలూ మాట్లాడుకున్నాం. అందులో రెండు విషయాలు నన్ను పదే పదే ఆలోచింపజేశాయి. ఒంటరిగా ఉన్నప్పుడు అన్ని తరాల పాటలూ వింటూ అవే ఆలోచించేదాన్ని. మీతో ఆ రెండు అంశాలు పంచుకునే ప్రయత్నమే ఈ చిరు వ్యాసం.

కొత్త పాటల్లో సాహిత్యాన్ని మించి సంగీతం ఉంటుంది. పాత పాటల్లో సాహిత్యం స్పష్టంగా ఉంటుంది. అంత మాత్రాన పాత పాటల్లో అశ్లీల సాహిత్యం లేదనుకుంటే పొరపాటే. హిట్ పాటల్ని పదే పదే వింటూ ఆస్వాదిస్తూ ఉంటాం. పాత పాట అయినా, కొత్తదైనా మనం ఆస్వాదించేది సంగీతం, గాయని, గాయకుల స్వరం. ఈ రెండూ మన అభిరుచికి అనుగుణంగా ఉంటే, సాహిత్యాన్ని పెద్దగా పట్టించుకోం. ఓసారి సాహిత్యంపై మనసు పెట్టి వింటే ఆ పాట మనకి ఏం తెలియజేస్తుందో స్పష్టంగా అర్థమవుతుంది. మంచి సాహిత్యాన్ని ఆస్వాదించే వాళ్ళు చాలా తక్కువ మంది ఉంటారు. మంచి సాహిత్యం అంటే మళ్ళీ అందులో ఒక చిక్కు ఉందండోయ్! నీకు మంచి అనిపించేది, నాకు మంచి కాకపోవచ్చు.

మంచి సాహిత్యం అనే ఒక ముసుగులో మనకి తెలియకుండానే మనం కొన్ని సాధారణీకరణలకు వచ్చేస్తుంటాం. ఈ మంచి సాహిత్యంలో స్త్రీ అంటే పురుషుడికి రాముడి కోసం సీతలా... అనే రేంజిలో చిత్రీకరణ ఉంటుంది. స్త్రీ మగాడి ముందు అణగిమణిగి ఉండాలి, వాడేం చేసినా భరించాలి అనేవిధంగా సాహిత్యం కూడా పురుషాధిక్యతను ప్రోత్సహిస్తుంది. ఇలాంటి సాహిత్యం చాలా మంది దృష్టిలో మంచి సాహిత్యం. మగవారికే కాదు ఆడవారికి కూడా ఆ సాహిత్యంలో జరిగే స్త్రీ చిత్రీకరణ ఆదర్శప్రాయం.

ఒకప్పటి సినిమాల్లో సావిత్రి పాత్రలు అన్నీ ఆదర్శవంతమైన పాత్రలే. 'ఆదది ఇలా ఉండాలి ' అంటూ ఆదర్శనారి లక్షణాలన్నీ ఆ పాత్రలో చిత్రీకరించేవారు. స్త్రీ ఇలా ఉండకూడదు అన్నట్లు సూర్యకాంతం, ఛాయాదేవి పాత్రలు చిత్రీకరించి గయ్యాళి పాత్రలుగా వాటిని

ప్రమోట్ చేసేవాళ్ళు. ఎవరినైనా సావిత్రి పాత్రల్ని అన్వయిస్తూ ఆదర్శప్రాయంగా ఉన్నట్టు, తెలుగింటి ఆడపడుచు అని అంటే తెగ మురిసిపోతూ అదే భ్రమలో బతికేస్తుంటారు. సాహిత్యంలో నాటికీ నేటికీ మంచి సాహిత్యం అంటే పురుషుడిని తన పాలిట దేవుడిలా భావిస్తూ తనని తాను తగ్గించుకుంటూ పాడిన పాటలే.

త్రిశూలం సినిమాలో...

"రాయిని ఆడది చేసిన రాముడివా?

తలపై గంగని మోసిన శివుడివా?"

గోదావరి సినిమాలో...

"మనసా వాచా... నీ జతలోనే బ్రతుకనుకోనా.. రాముని కోసం సీతలా...

ఈ రెండు పాటల్లో ఒకటి పాతది, మరొకటి కొత్తది. రెండిట్లోనూ పెద్ద తేడా ఏమీ లేదు. "మగవాడు ఏదో ఉద్ధరించేశాడు. ఆడది వాడికి సబార్డినేట్‌గా ఉండాలి" ఇదే మరి మన మంచి సాహిత్యం మనకి చాటి చెప్పేది ఇదే. వీటి ప్రభావం సమాజంపై ఎంత వరకు ఉంది? ఆనాటి ఆదర్శనారి ధోరణి ఇంకా మన సమాజంలో అలాగే కూరుకుపోయి ఉంది. ఇప్పటికీ మగవాడికి సబార్డినేట్‌గా ఉండే మహిళే ఆదర్శప్రాయం. ఓర్పు, సహనం, పొందిగ్గా ఉండడం, త్యాగం, అణిగిమణిగి ఉండటం, సర్దుకుపోయే మనస్తత్వం ఇవన్నీ ఆడపిల్లకి ఉండాల్సిన ఆదర్శ లక్షణాలు. మగవాడికి ఈ లక్షణాలు ఉండక్కర్లేదు. వాడు ఎలా ఉన్నా సర్దుకుపోవాల్సింది నువ్వేనమ్మా! నీకు మాత్రం ఈ లక్షణాలన్నీ పుష్టిగా ఉండాలి. అప్పుడే నీకు మంచి పేరు అని చెబుతోంది ఈ సాహిత్యం.

"ఓ మహిళా! మేలుకో.

అణకువ, త్యాగం, ఓర్పు, సహనం మగాడి దగ్గర మెప్పుకోసం కాదు.

వాటివల్ల వచ్చే ముప్పుల్ని నిలదొక్కుకుంటూ ముందుకు సాగాల్సిన శక్తి కోసం. అన్ని రంగాల్లో ముందుకి సాగిపోతూ బలంగా నిలబడే శక్తి నీకు ఆదర్శం కావాలి

కానీ అవసరం లేని అణకువ, సహనం బలహీనత కాకూడదమ్మా!"



స్త్రీని ఒక అంగడి బొమ్మగా చూసే ఈ సమాజంలో ద్వంద్వ అర్థాలతో కూడిన అశ్లీల సాహిత్యాన్ని ప్రశ్నించే వారికన్నా ఆహా! అంటూ ఆస్వాదించే వాళ్ళ స్వరమే ఎక్కువగా వినిపిస్తోంది. స్త్రీ శరీర భాగాల్ని రక రకాలుగా వర్ణిస్తూ అశ్లీల పదజాలాన్ని ఉపయోగిస్తే ఆ పాట హిట్. రోడ్లపై వచ్చే పోయే అమ్మాయిల్ని చూస్తూ అలాంటి పాటలుపాడి వాళ్ళని ఏడిపించడంలో వచ్చే పైశాచికానందం ఇంకెక్కడైనా దొరుకుతుందా ఓ అబ్బాయికి. దీంట్లో సాహిత్యం ప్రభావం లేదంటారా? సినిమా పాటలు, పదజాలం, చిత్రీకరణ ప్రభావం సమాజంపై ఎంత తీవ్రంగా ఉంటుందో ఏనాడైనా ఆలోచించారా? దీనికి వ్యతిరేకంగా గొంతు వినిపిస్తున్నారా? సినిమాల్లో సన్నివేశాల్ని, పాత్రల్ని అనుకరించి అమ్మాయిలపై దాడులు, అసభ్యంగా ప్రవర్తించే మగ మహారాజులెందరో? స్త్రీని ఒక భోగ వస్తువుగా తప్ప మరో దృష్టితో చూడలేని పురుషులు రోజు రోజుకీ పెరిగిపోతున్నారు. స్త్రీని ఇలా చూడకురా అని చెప్పే సందేశాత్మక సినిమాలు కొట్టుకు పోతున్నాయి. అమ్మాయి అంగాంగాలను చూపించే బూతు సినిమాలు సూపర్ హిట్. మనసు-మమత, మానవత లాంటి మాటలు మట్టి కొట్టుకుపోతున్నాయి.

" ఓ స్త్రీ పాలిట దేవుడా! శరీరాన్ని కాదు, ముందు స్త్రీని తోటి మనిషిగా చూడడం నేర్చుకో. స్త్రీ లేనిదే మానవ జాతి మనుగడే లేదని గుర్తుంచుకో. మమత, మానవతలను పంచుకోవడం, పెంచుకోవడం నేర్చుకో! ●

## అసమానత ఆరని చిచ్చు

ఆమెకి
ఇంటిపని వంటపని
అంటూ బాల్యం - అంతా
బరువులు మోపారు
అందాల రాకుమారుడు- రెక్కల గుఱ్ఱం
అంటూ.. ఆశలు రేపారు
పల్లకీలో ఊరేగింపులు అంటూ
కొసరి.. కొసరి..
ఊహల్లో ఊరేగించారు!

అతడికి
చదువు, కొలువూ అంటూ
బాల్యం అంతా
అందలమెక్కించారు
మగ మహారాజువంటూ
అహం ప్రోది చేశారు
అణకువగల భార్య..
నీ సొంతం అంటూ
వంశాన్ని వృద్ధి చేసే సంతానం
నీది అంటూ కిరీటాలు తొడిగారు!!

ఫలితం-
జీవితంలో బండి చక్రాల్లా
సమన్యాయంతో సంతోషకరమైన
పయనంలా...
సాగాల్సిన వారి జీవనపయనంలో
అన్నిటా తానే ఎక్కువ- అనే
అహం అతనికి
అన్నిటా తాను తక్కువ అనే
ఆత్మ న్యూనత ఆమెలో..
తరతరాల సంకుచితత్వంలో
బ్రతుకుబండి గాడితప్పింది
తిరోగమనానికి దౌడు తీస్తుంది
అనివార్యమైన సహజీవంలో
మనుష్యుల మధ్య ఆడ-మగ రగిల్చింది
అది దావానలమై అంతటా
విజృంభిస్తుంది.

-దుర్గాప్రసన్న

# మాయమవుతున్న మానవత్వం

ఓ నవీన యుగపు మానవుడా...
అంబరంలో విహంగంలో ఎగురుతున్నావు.. నీటిలో మీనమై ఈదుతున్నావు
మర యంత్రంలో గుసగుసలాడుతూ... మాటల మయాజాలంతో మైమరపిస్తున్నావు...
మాయ చేస్తున్నావు... కానరాని గ్రహాంతరాలతో చెలిమికి ఉవ్విళ్ళూరుతున్నావు...
పుడమి తల్లి కడుపు కెలికి పిల్ల ప్రేగులో సారాన్ని సైతం జుర్రుకుంటున్నావు
సాంకేతికత అనే మరీచిక వెంట అంతులేని ఆశతో పరుగెడుతూ...
నీ అస్థిత్వాన్ని కోల్పోతున్నావని గమనిస్తున్నావా?..

మాయ తెరల మాటున మోహపు చూపుతో పచ్చని బ్రతుకుల్లో కార్చిచ్చు రగిలించి వికటాట్టహాసం చేస్తున్నావు..
సాటిమనిషి మనశ్శాంతిని హరించివేస్తున్నా నీ వికృత రూపం వికటాట్టహాసం చేస్తుంటే,,
అంతరాత్మకు ముసుగు వేసుకుని ఆత్మ వంచన చేసుకుంటున్నావు... అజ్ఞానానికి పరాకాష్టగా మిగిలిపోతున్నావు.
మనిషి మనిషిగా బతకలేని విచిత్రమైన సంకటస్థితికి నెట్టివేయబడుతున్నావు
మానవత్వపు చిరునామా మాయమవుతున్న తరుణంలో..
శరీరాన్ని కోల్పోయిన నీ అస్థిపంజర భయానక ఆకృతి నిన్ను హెచ్చరించటం లేదా?

విజ్ఞానమనే భ్రమల త్రిశంకు స్వర్గంలో పయనిస్తున్న నీకు
మానవత్వపు విలువలు ఆహుతై పోవటం కానరావటం లేదా...
వర్తమానాన్ని జీర్ణించుకోలేని గతం ఇదేనా నా భవిష్యత్తని సిగ్గుతో రోదిస్తోంది.
విజ్ఞానపు మత్తులో నిన్ను నీవే దహించుకుంటూ..
మనసున్న మనిషిగా బ్రతకటం మరిచిపోతున్నావు..
తనివి తీరని కలల సౌధపు పునాదుల్లో నీకు నీవే సమాధైపోతున్నావు.
నవీన పోకడలకు నాంది పలికిన ఓ ఆధునిక మానవుడా..
ఆధునికత, సాంకేతికత మానవ మనుగడకు అవసరమే కానీ అంతం కాకూడదని మాత్రం మరువకు
మానవీయ విలువల్ని మరచిపోయేలా చేయకు...

(రోజు రోజుకీ పెరిగిపోతున్న సైబర్ క్రైమ్ పట్ల బాధతో..)

మైలవరపు నాగమణి

చట్టాలు

# ఇండియన్ పీనల్ కోడ్ యాక్ట్ 1860

-ఆర్. దుర్గాప్రసన్న

మనిషి సంఘజీవి. మనుష్యులంతా ఒక్కటిగా, కలిసి మెలిసి సంఘటితంగా సుఖసంతోషాలతో మెలగవలసిన ఆవశ్యకతని కూడా గుర్తించవలసి ఉంటుంది. తమయొక్క స్వేచ్ఛను కాపాడుకుంటూ ఎదుటివ్యక్తి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు భంగం కలిగించకుండా నడచుకోవలసి ఉంటుంది. అలా కాకుండా ఎదుటి వ్యక్తులకు గానీ, సమాజానికిగాని కష్ట, నష్టాలను కలిగించే తీరుగా మనిషి ప్రవర్తించినపుడు ఆ చర్యను నేరంగా పరిగణించి తగు శిక్షలను నిర్ధారించే చట్టమే 'ద ఇండియన్' పీనల్ కోడ్' Act XLV of 1860 నాటి బ్రిటిష్ ఇండియాలో అక్టోబర్ నెల 6వ తేదిన అమలులోకి వచ్చింది. 23 విభాగాలు (ఛాప్టర్స్) విభజించబడిన ఈ చట్టంలో ముఖ్యంగా XVI, XX, XXXII విభాగాలలో స్త్రీల కొరకు ప్రత్యేకమైన సెక్షన్లు వివరించబడ్డాయి. అంటే స్త్రీలు, పిల్లలపై సమాజంలో జరిగే నేరాలను చర్చించి వారియొక్క మానసిక, శారీరక స్వేచ్ఛను హరించే విషయాలు, హింసలను నేరాలుగా పరిగణించి శిక్షలను ఖరారు చేయడం జరిగింది. స్త్రీలపై జరిగే లైంగిక దోపిడీని చాలా తీవ్రమైన నేరంగా గుర్తించడం జరిగింది. ఏ స్త్రీ పట్ల అయినా ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా లైంగిక చర్య ఏ పురుషుడు జరిపినా అతడు శిక్షార్హుడే అంటూ స్పష్టం చేసిందీ చట్టం. స్త్రీ యొక్క గౌరవానికి భంగం కల్గించే విధంగా ఏ పురుషుడు ప్రయత్నించినా, భంగం కలిగించినా అతడు శిక్షార్హుడే. వివాహము, ఆస్తి లాంటి అనేక ముఖ్యమైన నేరాల పట్ల కూడా ఈ చట్టం కొరడా ఝులిపించింది. తరువాతి కాలంలో ఈ చట్టంలోని కొన్ని సెక్షన్లను సవరింపులద్వారా అనుబంధ సెక్షన్లుగా వివరించి స్త్రీ పట్ల నానాటికీ సమాజంలో పెరిగే హింసనూ, దోపిడి, దాడులను అరికట్టడానికి ప్రయత్నిస్తూనే ఉంది ఈ చట్టం.

- సెక్షన్: 304-బి Dowry Death వరకట్న చావుగాను వివాహానంతరం అదనపు కట్నం అంటే ఆస్థిని కానీ, ధనాన్ని కానీ ప్రత్యక్ష్యంగా కానీ, పరోక్షంగాకానీ, భర్తగానీ, అత్తింటివారు కానీ కోరితే వివాహిత మరణానికి కారకులైతే దానిని వరకట్న చావుగా పరిగణించి అందుకు కారణమైన వారిని ఏడు సంవత్సరాలకు తక్కువ కాకుండా లేదా జీవితఖైదు విధించే అవకాశం వుంది.
- సెక్షన్: 306 307 Abetment of Suicide కుటుంబాల్లో ఇళ్ళల్లో స్త్రీపై జరిగే హింసకు బలి అయిన తాను మరణించినా, ఆ హింస తట్టుకోలేక ఆత్మహత్యకు పాల్పడినా, ఆ కుటుంబంలోని వ్యక్తులు, భర్త, అతని బంధువులు శిక్షార్హులు.
- సెక్షన్ :375-376 RAPE లైంగిక నేరము, శిక్షలు సెక్షన్ 498-ఎ పెళ్ళి అయిన ఏడు సంవత్సరాలలోపు అత్తవారింట్లో ఏవిధమైన వేధింపులకు గురిఅయినా, మరణానికి ప్రోత్సహించబడినా ఆ స్త్రీ యొక్క భర్త, అత్తమామలు, ఆడపడుచులు తదితరులందరిని నేరస్థులుగా పరిగణించి వెంటనే అరెస్టుచేసి 3స॥ జైలు శిక్ష మరియు జరిమానా విధించవచ్చును.
- సెక్షన్ : 312ఐపిసి, 318ఐపిసిల ప్రకారం గర్భస్రావానికి కారకులను గర్భస్థ శిశువుకి ప్రమాదం కల్గించిన వారిని, శిశువులకు హాని కల్గించేవారిని శిక్షార్హులుగా ప్రకటించారు.

స్త్రీల పట్ల అమానుషంగా ప్రవర్తించే వారిని, వారికి నష్టపరిచే వారిని, వారి యొక్క ధన, మాన ప్రాణాలనే కాక వారి స్వేచ్ఛను హరించేవారిని ఇలా అనేక నేరాలకు పాల్పడేవారిని కూడా ఈ ఇండియన్ పీనల్‌కోడ్ నేరస్థులుగా గుర్తించి శిక్షలు ఖరారు చేసింది.

అయితే యంత్రాంగంలో లోపమో, న్యాయ వ్యవస్థపట్ల అపనమ్మకమో చాలా వరకు స్త్రీల పట్ల జరిగే నేరాలు క్రిమినల్ కంప్లయింట్ దశలోనే ఆగిపోతూ వుంటున్నాయి. మరికొన్ని సాక్ష్యాధారాలు, న్యాయవ్యవస్థలో వుండే జాగు, శ్రమకి ఓర్చుకోలేక, అంగబలం, అర్థబలం లేని కారణాలచేత అనేక కేసులు కోర్టుల్లో వీగి పోతున్నాయి అని చెప్పక తప్పదు. కానీ స్త్రీలపై జరిగే అత్యాచారాలు రోజురోజుకీ పెరుగుతున్నాయి. నాగరిక సమాజంలో అవి వికృత రూపం దాల్చుతూ ఉన్నాయి. కేవలం పురుషుల కారణంగా స్త్రీపై జరిగే దాడులను కట్టడి చేయడం సమాజానికి క్లిష్టంగా మారింది. ఉదా॥ లైంగిక దాడులు, గృహహింస, యాసిడ్‌దాడులు మొదలైనవన్నీ స్త్రీల మానప్రాణాలను హరిస్తున్నాయి. ఇటువంటి కేసుల్లో విచారణ వేగవంతంగా జరిగి బాధితులకు న్యాయం, నేరగాళ్ళకు శిక్ష తప్పనిసరి చేస్తూ వెను వెంటనే విచారణ/ కఠిన శిక్షలు అమలు జరిగే విధంగా మళ్ళీ 2013లో కూడా సవరణలు జరిగాయి. అదే నిర్భయ చట్టంగా మనకందరికి తెలుసు. జస్టిస్ వర్మ కమీషన్ సిఫారసుల మేరకు 'నిర్భయ' ఉదంతం తరువాత 2013 మార్చి నెలలో ఇండియన్ పీనల్ కోడ్, ఇండియన్ ఎవిడెన్స్ యాక్ట్ (భారత సాక్ష్యాధారాల చట్టం) మరియు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లలో సవరణలు తీసుకుని వచ్చారు. ముఖ్యంగా స్త్రీల పట్ల జరిగే లైంగికదాడులను కట్టడి చేయడానికి ఆయా కేసులను త్వరితగతిని విచారించి నేరస్తులను శిక్షించడమేకాక తద్వారా నేర ప్రవృత్తిని నిరోధించడానికి ఈ సవరణలు ఆమెదించడం జరిగింది.

- ఇండియన్ పీనల్‌కోడ్ 1860లో గల సెక్షన్ 375 స్త్రీలపై జరిగే లైంగిక దాడిని అంటే ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా జరిగే ఏ లైంగిక చర్యనైనా RAPE నేరంగానే గుర్తించడం జరిగింది. సెక్షన్ 376 ప్రకారం ఏడు సం॥రాలకు తగ్గకుండా జైలుశిక్షా లేదా పది సం॥ జైలుశిక్ష లేదా జీవిత కాలం జైలుశిక్షతోపాటు జరిమానా విధించవచ్చును.
- 2013వ సంవత్సరంలో జరిగిన సవరణల ద్వారా సెక్షన్ 375లోని 'అత్యాచారం' (రేప్) నిర్వచనాన్ని మార్చుతూ లైంగిక దాడిగా వర్ణించారు. లైంగిక దాడికి పాల్పడిన నేరస్థుడికి సెక్షన్ 376 ఎ ద్వారా కఠిన కారాగార శిక్ష 20సం॥లు తగ్గకుండా విధించవచ్చు.' గ్యాంగ్‌రేప్' కేసుల్లో కూడా ఇదే విధమైన శిక్షలు నేరగాళ్ళందరికీ వర్తిస్తాయి. బాధితురాలికి సత్వరన్యాయం, వైద్యసహాయం, ఆర్థిక సహాయం (compensation) అందించడం ప్రభుత్వ బాధ్యతగా నిర్ధారించడం జరిగింది.
- ఉద్దేశపూర్వకంగా స్త్రీని తాకటం కూడా లైంగిక దాడిగానే పరిగణిస్తూ దీనికి గరిష్టంగా 5సం॥లు కఠిన కారాగార శిక్ష, జరిమానా కూడా విధించవచ్చును.
- లైంగికపరంగా స్వాగతించలేని పదాల వాడకం, సైగలు వంటి చర్యలు కూడా శిక్షార్హమైన నేరాలే. అత్యాచార సంఘటనలపై ఫిర్యాదు తప్పనిసరిగా నమోదుచేయాలి.
- సెక్షన్ : 326-ఎ యాసిడ్ దాడులకు 10సం॥ కఠిన కారాగార శిక్ష మరియు జరిమానా
- సెక్షన్: 326-బి. యాసిడ్ దాడికి ప్రయత్నించిన నేరానికి 5నుండి 7సం॥ జైలు శిక్ష, జరిమానా.
- సెక్షన్: 354-ఎ sexual Harrassment.పాల్పడే నేరగాళ్ళకు 5 సం॥ వరకు జైలు శిక్ష, జరిమానా.

నేరానికి శిక్ష ఉండాలి. కానీ శిక్షలకు భయపడి నేరాలు ఆగుతాయా? ఆగుతున్నాయా? అన్నది ప్రశ్న? అయితే నేరం జరిగిన వెంటనే బాధితురాలు లేదా ఆమె తరపున ఎవరైనా పోలీసు స్టేషన్‌లో కంప్లైంట్ ఇవ్వాలి. కానీ సమాజంలో నేర మనస్థత్వం, స్త్రీలంటే చులకన భావం రోజురోజుకు పెరుగుతుంది. ఒంటరి స్త్రీ పోలీసు స్టేషనుకు వెళ్ళడానికి తటపటాయించే రోజులివి. వ్యవస్థ పట్ల నమ్మకం కలిగేలా అధికారుల తీరు ఉండాలి. సమాజంలో స్త్రీ పురుషులు పరస్పర గౌరవంతో నమ్మకంతో సహజీవనం చేయగలగాలి. అపుడే నేర ప్రవృత్తిని అరికట్టడం సాధ్యమవుతుంది. అపుడే సమాజం స్త్రీకి భద్రతని కల్గించగలదు. అందుకు ఈ చట్టం కూడా కొంత వరకు దోహదపడుతుంది. ●

---




**ఎడిటర్‌గారికి,**

రూపాయివిలువ పతనం వ్యాసం చాలా బాగుంది. అందరికి అర్థమయ్యేవిధంగా సమాజంలో ఆర్థిక వ్యవస్థ ప్రధానపాత్ర పోషిస్తుంది. రూపాయి విలువ పతనం ఆర్థిక వ్యవస్థను అతాలాకుతలం చేస్తుంది. వ్యాసం సంక్షిప్తంగా వున్నప్పటికీ రచయిత కొన్ని పట్టికలు కూడా ఇచ్చారు. పాఠకులకు సులభంగా సమాచారం అందించారు. విశాఖ అచ్చుతాపురంలోని ఎస్.ఇ.జడ్.లో కంపెనీకి సంబంధించి బి. ప్రభావతిగారి పోరాట విజయం వ్యాసం చైతన్యానికి ప్రతీక.

**కుంపాల శ్రీరాంమూర్తి, గాజువాక - విశాఖ**

పత్రికల్లో శీర్షికలు అన్నీ బావున్నాయి. పత్రిక అందగానే చదివించేవి తరవాత బాగున్నాయి. అనిపించేవే. అయితే ఎం.సుధగారి 'అమ్మ నిర్ణయం' నన్ను ఎందుకో చాలా హత్తుకుంది. తరచి చూస్తే ప్రపంచంలో ఆత్మాభిమానం కలిగిన అమ్మలందరూ ఇలానే వున్నారు కదా! అన్పిస్తుంది. పురుష స్వార్థంతో కుటుంబాన్ని కోరుకుంటాడేమో కానీ స్త్రీ ముఖ్యంగా అమ్మ స్థానంలో ఉన్న, స్త్రీ మాత్రం కుటుంబం పట్ల తన బాధ్యతని నిస్వార్థంగా నిర్వర్తిస్తునేఉంది.

**దుర్గా ప్రసన్న హైదారబాద్**

అక్టోబర్- డిసెంబర్ పత్రిక చాలా బావుంది. సంపాదకీయంతో మొదలుపెట్టి, చివరిపేజీ వరకూ, ప్రతి శీర్షిక పాఠకులను చదివించేలా వుంది. ఎన్నో ఆసక్తి కరమైన, విజ్ఞాన దాయకమైన విషయాలు తెలిపారు.

చట్టాల గురించి, అనేకంగా మహిళలకు సంబంధించినవి ప్రతిసారి కవర్ చేస్తున్నారు. చట్టంపై అవగాహన వచ్చేందుకు తోడ్పడుతోంది. అయితే దానిని ఇంకొంచెం రీడబుల్‌గా చట్టంలోని అంశాలు 1,2,3 అని పెట్టి ఉల్లంఘిస్తే ఏం చేయాలో కూడా చెప్తూ, ఎక్కడ కంప్లయింట్ చెయవచ్చు తదితర అంశాలతో, చదవగానే అర్థం అయ్యేట్టు వుంటే ఇంకా బావుంటుంది.

**వి. గౌరి. హైదరాబాద్**

చైతన్యమానవి చాలా బావుంది. టైటిల్ పేజీ నేటి పరిస్థితికి అద్ధం పట్టేదిగా వుంది. అమ్మాజీ "శేషప్రశ్న" కథ చాలా బావుంది. నేడు అందరి మనసుల్లో కదులుతున్న శేషప్రశ్న ఇది. మొదటి నుంచి, చివరి వరకూ నేటి సమాజిక వ్యవస్థకు ప్రతిభింబంగా వుంది. అయితే బిడ్డలను కనే విషయంలో వెనకాడింది. భర్త సహకారంతో ధైర్యంగా నిలబడ్డ వ్యక్తి. పిల్లల్ని కనే విషయంలో కూడా నిర్ణయం తీసుకుని అందుకు అణుగుణంగా వారిని మలుచుకొన్నట్లు రాస్తే ఇంకా బావుండేదేమో అనిపించింది.

**నీరజ, హైదరాబాద్**

చైతన్య మానవి పత్రిక చాలా చాలా విజ్ఞానదాయకంగా వుంటోంది. ఉభకాయం-అనర్థాలు వ్యాసం నేటి అవసరాలకు తగ్గట్టు వుంది. ఉపయోగకరంగా వుంది. అవగాహన సందర్భం శీర్షిక క్రింద వచ్చే ప్రతిఅంశం చాలా చాలా రిలవెంట్‌గా వుంటుంది. రచయిత్రికి ధన్యవాదాలు. ఆడపిల్లగా పుట్టడమే నా తప్పా? కె. అంజనగారి ఆర్టికల్ ముక్కలు-ముక్కలుగా అనిపించింది.

**విశాలాక్షి, హైదరాబాద్**

అపోహ – శాస్త్రీయం

# కుంకుమ పువ్వు రంగుకు కారణమా?

–డా॥ రమాదేవి

నా దగ్గర కొచ్చే గర్భిణీ స్త్రీలు, వాళ్ళ బంధువులు తరచుగా అడిగే ప్రశ్న ఇది. "కుంకుమ పువ్వు ఎన్నో నెల నుండి తీసుకోవాలి?" అని. కుంకుమ పువ్వు పాలలో కలుపుకొని గర్భంతో వున్న వాళ్ళు త్రాగితే పిల్లలు ఎర్రగా, మంచి రంగుతో పుడతారని చాలా మంది నమ్ముతారు. కానీ శాస్త్రీయంగా దీనికి ఏ రకమైన ఆధారం లేదు. అంతే కాదు నష్టం కలుగుతుందని ఇటీవలి శాస్త్ర పరిశోధనలలో తేలింది.

**కుంకుమ పువ్వుతో నష్టం వుందా?**

కుంకుమ పువ్వు ఎక్కువ మోతాదులో తీసుకోవడం వల్ల 14శాతం వరకు అబార్షన్ అయ్యే అవకాశం వుంది అని శాస్త్ర పరిశోధనలలో తేలింది. దీనికి గర్భసంచి కదలికలను ఎక్కువ చేసే గుణం వుందని తెలుసుకున్నారు. కాబట్టి గర్భంతో వున్న వాళ్ళు కుంకుమ పువ్వును తీసుకోకుండా వుండటమే మంచిది.

**చర్మానికి రంగు ఎలా వస్తుంది.?**

తెలుపు లేదా నలుపు రంగు అనేది వంశపారంపర్యంగా అంటే తల్లి లేక తండ్రి యొక్క జీన్స్‌ని బట్టి వస్తుంది. చర్మం రంగు ప్రధానంగా చర్మం పైపొరలో వున్న మెలనిన్ అనే కణాల ద్వారా తయారు చేయబడుతుంది. ఈ మెలనిన్ మెలనోసైట్లు అనే ప్రత్యేక కణాల ద్వారా ఉత్పత్తి చేయబడుతుంది. ఈ మెలనిన్ సూర్యరశ్మి నుండి వచ్చే చర్మానికి హానికరమైన అల్ట్రావయొలెట్ కిరణాలను క్రమబద్ధీకరిస్తుంది. అంటే గొడుగులాగా చర్మాన్ని సూర్యరశ్మి నుండి కాపాడుతుందన్న మాట.

మెలనోసైట్ల ద్వారా రెండు రకాలైన మెలనిన్ ఉత్పత్తి అవుతుంది.

1. యూమెలనిన్ నలుపు లేదా చామనఛాయను కలిగిస్తుంది.



2. ఫియోమెలనిన్ అనేది ఎరుపు లేదా లేతగోధుమ వర్ణాన్ని కలిగిస్తుంది. బాగా నల్లగా వున్న వాళ్ళలో ఎక్కువ మోతాదులో మెలనిన్ ఉత్పత్తి అవుతుంది. ఇదంతా జీన్స్ మీద ఆధారపడి వుంటుంది.

**మెలనిన్ ఉపయోగం:–**

మెలనిన్ హానికరమైన సూర్యరశ్మి ద్వారా వెలువడే అల్ట్రావయొలెట్ కిరణాల నుండి శరీరాన్ని రక్షిస్తుంది. ఈ అల్ట్రావయొలెట్ కిరణాలను 'ఎ,బి' మరియు 'సి' గా వర్గీకరించారు. యువిఎ మరియు యువిబి చర్మానికి హాని కలిగిస్తాయి. మెలనిన్ పదార్థం ఇవి చర్మంలోకి చొచ్చుకొని పోకుండా కాపాడుతుంది. మెలనిన్ తక్కువ మోతాదులో లేక పూర్తిగా లేకుంటే చర్మకాన్సర్ వచ్చే అవకాశం ఉంది. అందుకనే యూమెలనిన్ అతి తక్కువగా వున్న పాశ్చాత్య దేశాలలో చర్మకాన్సర్ ప్రమాదం చాలా ఎక్కువ. అందుకనే నల్లగా లేదా గోధుమ రంగులో వున్నందుకు సంతోషిద్దాం.

ఎండకు వెళ్ళినప్పుడు చర్మం నల్లబారడాన్ని గమనిస్తాము. అంటే రక్షక కవచంలాగా పనిచేస్తుంది. అందుకనే ఉష్ణప్రాంతాలలో నివసించే వాళ్ళు నల్లగాను, శీతల ప్రాంతాలలో నివసించే వాళ్ళు తెల్లగాను ఉంటారు. అయితే పాశ్చాత్య దేశాలను గుడ్డిగా అనుకరించే మనం వాళ్ళ రంగుని తెచ్చుకోవడమే అందంగా భావిస్తాము. కాస్మోటిక్ కంపెనీలు వాళ్ళ కళ్ళతో చూడడం, దాన్నే ప్రచారం చేయడం. దానిలో భాగంగానే కోట్లాది రూపాయల వ్యాపారం ఫెయిర్‌నెస్ క్రీముల ద్వారా జరుగుతోంది. నల్లగా వున్నవాళ్ళను చిన్నచూపు చూడడం ఇందులో భాగమే.

అర్థమయిందికదా! చర్మం రంగుకు అసలు కారణమేంటో, కుంకుమ పువ్వు వలన లాభము కంటే నష్టమే ఎక్కువని. ఇకనైనా జాగ్రత్తపడదాం!



# ఉద్యమాల బాటలో

**ముస్లిం-మహిళా సమస్యలపై:-** ఐద్వా 10వ ఆలిండియా మహాసభల సందర్భంగా హైదరాబాద్‌లో ముస్లిమ్ మహిళల



హైదరాబాద్

సమస్యలపై రౌండ్‌టేబుల్ సమావేశం నిర్వహించారు. ముస్లిమ్స్ నివసించే బస్తీలు అభివృద్ధికి ఆమడదూరంలో వుండటంతో ప్రభుత్వ సంక్షేమ పథకాలేవీ వారికి అమలు కావడం లేదు. పథకాలకు సంబంధించిన సమగ్ర సమాచారం కూడా వారికి తెలియదు. ఐద్వా


హైదరాబాద్

నిర్వహించిన ఈ రౌండ్ టేబుల్ సమావేశంలో ఆయా బస్తీల నుండి హాజరయిన మహిళలు అనేక సమస్యలు ఏకరువు పెట్టారు. మైనార్టీ కమిషన్ నుంచి వచ్చిన సభ్యులు కూడా మాట్లాడుతూ మైనారిటీ మహిళలకు సంక్షేమ పథకాలు అందేలా చర్యలు తీసుకుంటామని హామీ ఇచ్చారు.

**హింసలేని సమాజాన్ని నిర్మిద్దాం:**

నవంబర్ 25 'హింసా వ్యతిరేక దినం' మొదలుకొని డిశంబర్ 10 'మానవ హక్కుల దినం' వరకు 15 రోజులపాటు రాష్ట్ర వ్యాప్తంగా మహిళలపై పెరుగుతున్న హింసను అరికట్టాలని కోరుతూ "మహిళల హక్కులే మానవ హక్కులు, హింస లేని సమాజం నిర్మిద్దాం" అనే స్లోగన్లు ఉన్న బ్యాడ్జీలను ధరించి ఎస్ఎఫ్ఐ,



తూర్పుగోదావరి

ఐద్వా ఆధ్వర్యంలో విస్తృత ప్రచారం నిర్వహించారు. బస్తీలలో, కాలనీలలో, కాలేజీలలో, కూరగాయల మండీల్లో కూడా బ్యాడ్జీలను ధరించి తమ ఆకాంక్షను వ్యక్తపరచడంతోపాటు హింసలేని సమాజాన్ని నిర్మించడంలో అందరూ భాగస్వాములు కావాల్సిన



నిజామాబాద్

అవసరాన్ని తెలియచేశారు. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని ప్రధాన పట్టణాల్లో, మండల కేంద్రాల్లో, కాలేజీల్లో హింసకు వ్యతిరేకంగా అవగాహనా కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి.

**శ్యామిలీ గుప్తాకు నివాళులు:** ఐద్వా వ్యవస్థాపకుల్లో ఒకరు, ఆలిండియా అధ్యక్షులుగా పనిచేసి బుద్ధగయలో జరిగిన 10వ ఆలిండియా మహాసభలో ప్యాట్రన్‌గా ఎన్నికైనా కా॥ శ్యామిలీ గుప్తా నవంబర్ 25న కలకత్తాలో కనుమూసారు. ఉద్యమమే ఊపిరిగా జీవితాన్ని గడిపిన శ్యామిలీగుప్తాకు నివాళులర్పిస్తూ హైదరాబాద్, విశాఖ,ఖమ్మం, విజయవాడ, గోదావరిఖని తదితర పట్టణాలలో



హైదరాబాద్

సంస్మరణ సభలు జరిగాయి.

**జెండా ఆవిష్కరణలు:** నవంబర్ 22 నుండి 25 వరకు బీహార్ రాష్ట్రంలోని బుద్ధగయాలో జరుగుతున్న ఐద్వా జాతీయ మహాసభల సందర్భంగా దేశ వ్యాప్తంగా నవంబర్ 19న ఐద్వా జెండాలను ఆవిష్కరించాలని, మహాసభలు జరుగుతున్నాయన్న సందేశాన్ని అందిరికి అందజేయాలని ఐద్వా కేంద్ర కమిటీ పిలుపు నిచ్చింది. అందులో భాగంగా రాష్ట్రం అన్ని జిల్లాలు పట్టణాలు, డివిజన్ కేంద్రాలు, మండల కేంద్రాలు, వార్డుల్లో జెండా ఆవిష్కరణలు జరిగాయి.


విజయనగరం

**మహాసభ పోస్టర్ విడుదల:** ఐద్వా 10వ జాతీయ



పశ్చిమగోదావరి

మహాసభల పోస్టర్‌ను రాష్ట్ర సెంటర్‌తోపాటు అన్ని జిల్లా కేంద్రాల్లో ఆవిష్కరించారు. ఉదారవాదాన్ని ప్రతిఘటిద్దాం, బూజు పట్టిన సాంప్రదాయాల్ని ఎదిరిద్దాం, మతోన్మాదంపై పోరాడుదాం అనే నినాదాలతో కూడిన పోస్టర్ చాలా మందిని ఆకట్టుకుంది.

**గ్యాస్ భారాలు– మహిళలకు శాపాలు:**


హైదరాబాద్ సౌత్

గ్యాస్ సిలిండర్‌ను ఆధార్‌తో అనుసంధానం చేసాక వినియోగదారులలో చాలా గందరగోళం నెలకొంది. ఆధార్ కార్డు రాక, వచ్చినా అందులో అచ్చుతప్పులు, ఆధార్ కార్డు గ్యాస్ ఏజెన్సీలో ఇచ్చినా బ్యాంకుతో అనుసంధానం కాక, అనేక రకాల ఇబ్బందులు వినియోగదారులు పడుతున్నారు. సబ్సిడీ డబ్బు బ్యాంక్



అనంతపురం

ఖాతాలో జమ అయిందో లేదో తెలియక, అనేక మందికి జమ కాక గందరగోళ పడుతుంటే ప్రభుత్వం జనవరి 1 నుండి సబ్సిడీ గ్యాస్ సిలిండర్ ధర 25 రూ॥లు, 9 సిలిండర్లు దాటితే పొందే అదనపు సిలిండర్లకు 217రూ॥లు, కమర్షియల్‌పై 380రూ॥లు పెంచింది. ఈ చర్య పట్ల సామాన్య, మధ్య తరగతి ప్రజానీకం ఆగ్రహంతో రగులుతున్నారు. ప్రభుత్వ చర్యను నిరసిస్తూ రాష్ట్ర వ్యాప్తంగా ఎక్కడికక్కడ ప్రభుత్వ దిష్టిబొమ్మలను దగ్ధం చేశారు. ప్రజా ఉద్యమాలకు, మహిళల ఆగ్రహానికి భయపడ్డ ప్రభుత్వం ఎలక్షన్లను కూడా దృష్టిలో పెట్టుకొని, ఆధార్‌కు గ్యాస్ అనుసంధానంతో పాటు సబ్సిడీ సిలిండర్ల సంఖ్య ఏడాదికి 12కు తాత్కాలికంగా పెంచింది.

**పిక్‌నిక్స్:** ఐద్వా ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా నవంబర్, డిశంబర్ నెలల్లో మహిళలకు, పిల్లలకు పిక్‌నిక్స్ నిర్వహించబడ్డాయి. ఇంటి పనులతో నాలుగు గోడలకు పరిమితమైన మహిళలకు శారీరక, మానసిక ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కలిగించాలని, ఒకరితో ఒకరు కలిసి మెలిసి గడపడానికి ఐక్యత పెంపొందించే ఉద్దేశ్యంతో పిక్‌నిక్స్ నిర్వహించబడ్డాయి. మహిళలను, కొత్త ప్రదేశాలకు తీసుకెళ్లడంతోపాటు కబడ్డి, రన్నింగ్, క్విజ్, ఉపన్యాస పోటీలు తదితర అంశాలపై ఆటల పోటీలు నిర్వహించడం వల్ల మహిళలు చాలా ఉత్సాహపడ్డారు. తాము నివసించే బస్తీలు, కాలనీల్లో కూడా సమస్యలు పరిష్కరించుకోవడానికి మహిళా సంఘం నిర్మించుకుంటామని ముందుకొచ్చారు.

**అమ్మ హస్తంలో కల్తీ సరుకులు:**

రాష్ట్ర ప్రభుత్వం ఆర్భాటంగా ప్రకటించిన అమ్మ హస్తం పథకం ద్వారా (చౌక దుకాణాల్లో) ఇస్తున్న 9 రకాల నిత్యావసర వస్తువుల్లో నాణ్యత లేదని కారం, పసుపుల్లో కల్తీ కలిపి ఇస్తున్నారని దీనివల్ల కారం చప్పగా చేదుగా ఉంటుందని, పసుపులో కూడా కలర్ కలిపారని, చింతపండు గింజలతో నల్లగా పురుగుపట్టిందని, గోధుమపిండిలో సన్న పురుగులు ఉన్నాయని, పప్పు కూడా రంధ్రాలు పడి పురుగులతో ఉన్నాయని, నాణ్యత లేని వస్తువులు సరఫరా చేయడం వల్ల ప్రజల ఆరోగ్యాలు దెబ్బతింటున్నాయని మహిళలు ఆందోళన, ఆగ్రహం వెలిబుచ్చుతున్నారు. కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజలను మోసం చేస్తు ఎన్నికల లబ్ధికి ఈ పథకాన్ని వాడుకుంటుంది. ప్రభుత్వం నాణ్యతగల 14 రకాల వస్తువులను సరఫరా చేయాలని ఐద్వాడిమాండ్ చేస్తోంది. రాష్ట్ర వ్యాప్తంగా అన్నిజిల్లాల్లో ఆందోళనా కార్యక్రమాలు జరిగాయి.

**టాన్యా జీవితం మహిళా పోరాటాలకు ప్రతిరూపం**

డాక్టర్ టాన్యా 2 వ వర్ధంతి అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఆధ్వర్యంలో హైదారబాద్, రంగారెడ్డి, ప.గోదావరి,



హైదరాబాద్

ప్రకాశం, నల్గొండ తదితర జిల్లాల్లో జరిగాయి. ఐద్వా ఉద్యమ నిర్మాత్లో ఒకరైన మోటూరు ఉదయం కుమార్తె డా॥ టాన్యా తల్లిదండ్రుల ఆశయాలు, కర్తవ్య నిర్వహణను తన లక్ష్యంగా మలుచుకున్నారు. డాక్టరుగా వైద్య వృత్తిని కొనసాగిస్తూనే సమాజం పట్ల తన బాధ్యతను నిర్వర్తించారు. మోటూరు ఉదయంట్రస్టు కోశాధికారిగా ఉండి ఉదయం ట్రస్టు ఏర్పాటు చేయడంలో, నడిపించడంలో, ఆర్థిక అవసరాలు తన వంతు కృషి శాయశక్తులా కృషి చేశారు. డా॥ టాన్యాకు నివాళులర్పిస్తూ అనేక జిల్లాల్లో పలు కార్యక్రమాలు జరిగాయి..

## చదవండి! చదివించండి!!

పాఠకుల నుండి విలువైన సలహాలు, సూచనలు ఆహ్వానిస్తున్నాము.

**చైతన్య మానవి**



**బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్; 2,1-8-1,**
**బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ -500 044.**
**ఫోన్ : 27605845.**












## బంగారుతల్లి పథకం ముఖ్యాంశాలు

- తెల్ల రేషన్‌కార్డు కలిగిన కుటుంబాల్లో 2013 మే 1 నుంచి పుట్టిన ఆడపిల్లలకు బంగారుతల్లి పథకం వర్తిస్తుంది. ఒక కుటుంబంలో ఇద్దరు ఆడపిల్లలకు మాత్రమే ఈ పథకం వర్తిస్తుంది. ఒక వేళ రెండవ కాన్పులో కవల ఆడపిల్లలు జన్మించిన ఎడల ఈ ఇద్దరు పిల్లలు కూడా ఈపథకమునకు అర్హులు.
- గ్రామంలో గర్భిణీ స్త్రీల జాబితాను గ్రామసంఘం ఎఫ్-I ఫార్మాట్‌లో తయారుచేయాలి. ఆ జాబితాను ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి అందజేయాలి. వైద్యాధికారి ఆ జాబితాను ధృవీకరిస్తారు.
- గర్భిణీ స్త్రీగా పేరు నమోదు కాగానే బ్యాంకు అకౌంటు ఏర్పాటు చేసుకోవాలి. ఆధార్ కార్డు లేకపోతే ఆధార్ గుర్తింపు కార్డును పొందాలి.
- బంగారుతల్లి పుట్టగానే పేరు పెట్టాలి.
- బంగారుతల్లి పుట్టిన తర్వాత కాన్పు జరిగిన గ్రామ పంచాయితీ లేక మున్సిపాలిటీలో జన్మ ధృవీకరణ పత్రాన్ని పొందాలి.
- బంగారుతల్లి జన్మించగానే ఎఫ్-II ఫార్మాట్ ద్వారా నమోదు చేయడానికి అవసరమయిన పత్రాలు- 1) జన్మ ధృవీకరణ పత్రం, 2) తల్లి లేదా సంరక్షణా వ్యక్తి యొక్క ఆధార్‌కార్డు, 3) తల్లి లేదా సంరక్షణా వ్యక్తి పేరు ఉన్న రేషన్ కార్డు (కొన్నిసార్లు తల్లి పేరు ఆమె పుట్టింటి రేషన్‌కార్డులో ఉండవచ్చును), 4) తల్లీబిడ్డల ఫోటో, 5) తల్లి లేదా సంరక్షణా వ్యక్తి బ్యాంకు అకౌంట్ నంబరు.
- బంగారుతల్లి ఆస్పత్రిలో జన్మించినట్లు ధృవీకరించగానే రూ. 2500 తల్లి లేదా సంరక్షణా వ్యక్తి అకౌంట్‌లో నేరుగా ఎలక్ట్రానిక్ విధానంలో జమ చేస్తారు.
- బంగారుతల్లికి ఏడవ సంవత్సరం రాగానే ఆధార్‌కార్డును పొందాలి. ఆ నెంబరును డాటాబేస్‌లో చేర్చాలి.
- ఏడవ సంవత్సరం రాగానే పాప పేరును కూడా తల్లి లేదా సంరక్షణా వ్యక్తి పేరుతో జతపరచి, జాయింట్ అకౌంట్‌గా మార్చాలి.

## బంగారుతల్లి మైలురాయి లక్ష్యాలు సాధించగానే లభించే లబ్ధి వివరాలు

| వయస్సు | సాధించవలసిన మైలురాళ్ళు | పూర్తి చేయాల్సిన లక్ష్యం | ప్రోత్సాహక మొత్తం (రూ॥లలో) | నమోదు లేదా అప్‌డేషన్‌కు బాధ్యులయిన అధికారులు | ధృవీకరణఅధికారులు |
|---|---|---|---|---|---|
| పుట్టగానే | జననం నమోదు చేయాలి. | ఆస్పత్రిలో కాన్పు జరగాలి | 2500 | గ్రామసంఘం/వార్డు సమాఖ్య | ఎ.ఎన్.ఎమ్ మరియు ఆస్పత్రి వైద్యాధికారి |
| మొదటి సం॥, రెండవ సం॥ నిండగానే | వ్యాధినిరోధక టీకాలు | టీకాలు వేయించాలి | ఏడాదికి 1000 చొప్పన | గ్రామసంఘం/వార్డు సమాఖ్య | ఏ.ఎన్.ఎమ్ |
| 3, 4, 5 సం॥లు నిండగానే | అంగన్‌వాడిలో చేర్చాలి | అంగన్‌వాడి చదువు | ఏడాదికి 1500 చొప్పన | గ్రామసంఘం/వార్డు సమాఖ్య | సూపర్‌వైజర్, ఐసిడిఎస్ |
| 6-10 సం॥లు నిండగానే | 1-5 తరగతుల చదువు పూర్తి చేయాలి | గుర్తింపు పొందిన పాఠశాలలో ప్రాథమిక విద్య పూర్తిచేయాలి | ఏడాదికి 2000 చొప్పన | గ్రామసంఘం/వార్డు సమాఖ్య | పాఠశాల ప్రధానోపాధ్యాయులు |
| 11-13 సం॥లు నిండగానే | 6, 7, 8 తరగతుల చదువు పూర్తి చేయాలి | గుర్తింపు పొందిన పాఠశాలలో ప్రాథమిక విద్య పూర్తిచేయాలి | ఏడాదికి 2500 చొప్పన | గ్రామసంఘం/వార్డు సమాఖ్య (6, 7 తరగతుల విద్యార్థులకు) పాఠశాల ప్రధానోపాధ్యాయులు (8వ తరగతి విద్యార్థులకు) | పాఠశాల ప్రధానోపాధ్యాయులు మండల/మున్సిపల్ విద్యాధికారి |
| 14-15 సం॥లు నిండగానే | 9, 10 తరగతుల చదువు పూర్తి చేయాలి | గుర్తింపు పొందిన పాఠశాలలో ప్రాథమిక విద్య పూర్తిచేయాలి | ఏడాదికి 3000 చొప్పన | పాఠశాల ప్రధానోపాధ్యాయులు | మండల/మున్సిపల్ విద్యాధికారి |
| 16-17 సం॥లు నిండగానే | 11, 12 తరగతులు / ఇంటర్మీడియెట్ పూర్తిచేయాలి | +2 ఉన్న హైస్కూల్‌లో లేదా జూనియర్ కళాశాలలో రెగ్యులర్ విద్యార్థిగా చదివి పరీక్షలకు హాజరు కావాలి | ఏడాదికి 3500 చొప్పన | ప్రిన్సిపల్, జూనియర్ కాలేజి/ హైస్కూల్ | మండల/మున్సిపల్ విద్యాధికారి |
| 18-21 సం॥లు నిండగానే | డిగ్రీ పూర్తిచేయాలి | కళాశాలలో రెగ్యులర్ విద్యార్థిగా చదివి పరీక్షలకు హాజరై ఉత్తీర్ణులు కావాలి | ఏడాదికి 4000 చొప్పన | కళాశాల ప్రిన్సిపల్ | జిల్లా ప్రాజెక్టు డైరెక్టర్, ఐ.సి.డి.ఎస్. |
| 21 సం॥లు నిండగానే | ఒకేసారి ప్రోత్సాహకం లభిస్తుంది | ఇంటర్మీడియెట్ లేదా డిగ్రీ ఉత్తీర్ణులు కావాలి | ఇంటర్మీడియెట్ పూర్తయితే 50,000 డిగ్రీ పూర్తయితే 1,00,000 | జిల్లా ప్రాజెక్టు డైరెక్టర్, ఐ.సి.డి.ఎస్. | జిల్లా ప్రాజెక్టు డైరెక్టర్, ఐ.సి.డి.ఎస్. |

సమాచారం మరియు ఫిర్యాదుల కొరకు సంప్రదించండి: **155321 & 18002004455** (గ్రామీణాభివృద్ధి శాఖ టోల్‌ఫ్రీ నెం.)

Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : T.Jyothi

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A142 |
| పుస్తకం పేరు | చైతన్య మాధురి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |